# JUNIOR QUEST



## NOW with the added fun of SPUTNIK Junior!




Selections from Sputnik Junior!.

* Colourfully illustrated stories and cartoons.
* Superb science fiction
* Entertainment and general knowledge

64 packed pages!
At just Rs. 5/-

Sputnik junior

To subscribe write to,
JUNIOR QUEST,
Dolton Agencies,
Chandamama Buildings,
N.S.K. Salai, Vadapalani,
Madras. 600 026.



A Chandamama
Vijaya Combines
publication



# చందమామ

అక్టోబర్ 1990



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| వార్తలు-విశేషాలు .... | 9 | మహారాజయోగం .... | 41 |
| వినీలుడి పగ .... | 11 | వీరహనుమాన్-5 .... | 45 |
| బందిపోటు యువరాజు-14 | 17 | విదూషకుడి పరిష్కారం .... | 53 |
| మంజీర కథ (బే.క) .... | 25 | మహాకావ్యం .... | 58 |
| చందమామ అనుబంధం-24 | 33 | ఇష్టంలేని న్యాయం .... | 61 |
| శ్రీరామకృష్ణపరమహంస-5 | 37 | ప్రకృతివింతలు .... | 63 |





విడి ప్రతి: 3-00
సంవత్సర చందా: 36-00

'మేరీ' గోల్డు కవరింగ్ జ్యూయలరీ ఫ్యాషన్సులో అందెవేసిన చేయి. ప్రపంచంలోని స్త్రీలందరూ నాణ్యతకు - మన్నికకు వాడవలసినవి - ధరించవలసినవి - అలంకరించ వలసినవి. కంటికింపగు యీ ఆభరణముల కొరకు నేడే మీ ఆర్డరును పంపించండి. వి.పి.పి. ద్వారా ఆభరణములను పొందండి డిజైను నంబర్లను మరియు ఉచితమైన కేటలాగులను ప్రత్యేకముగా అడుగుట మరిచిపోవద్దు.

DAD/MGC/06


























































# MERI GOLD COVERING WORKS

P.O.BOX 1405, 14, RANGANATHAN STREET
T.NAGAR, MADRAS - 600 017, PHONE: 444671

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## ఆలోచించతగిన అభిప్రాయం!

మానవజాతి అన్ని కాలాలలోనూ మంచి మార్గంలోనే పయనిస్తుందని చెప్పలేము. ఒక్కొక్కసారి మంచికన్నా చెడే శక్తివంతంగా పనిచేస్తుంది. అయినా, అన్ని కాలాలలోనూ సవ్యంగా ఆలోచించేవారు ఉంటూనే ఉన్నారు. వారి అభిప్రాయాలు విచిత్రంగా తోచి విస్మయం కలిగించవచ్చు. అయినా, అవి తీవ్రంగా ఆలోచించతగినవే!

హిందువులకూ, ముస్లింలకూ ప్రత్యేక దేశాలు కావాలన్న కోరికపై భారతదేశ విభజన జరిగింది. అయితే ఆ తరవాతి చరిత్ర—ఒకే మతానికి చెందిన ప్రజలున్నంతమాత్రాన దేశ ప్రజలందరూ ఐకమత్యంతో మసలుకుంటారని చెప్పడానికి అవకాశం లేదని నిరూపించింది. పాకిస్తాన్ విభజన జరిగి, బంగ్లాదేశ్ ఏర్పడింది. ఎన్నో ఆశలతో పాకిస్తాన్‌కు వెళ్ళిన ముస్లింలను పాకిస్తాన్ ఇంకా తనలో ఇముడ్చుకోలేక పోతున్నది కాని, కాశ్మీర్‌లో అశాంతిని సృష్టించడానికి మాత్రం వెనుకాడడం లేదు!

ఈ సందర్భంగా ప్రముఖ స్వాతంత్ర్యయోధుడూ, మాజీ కేంద్ర మంత్రి అయిన శ్రీ అబ్దుల్‌గఫూర్ ఒక పత్రికా గోష్ఠిలో కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చారు: ''మత ప్రాతిపదికపై జరిగిన మన దేశ విభజన ఆత్మహత్యతో సమానం అని అనడం నిజాన్ని మళ్ళీ మళ్ళీ చెప్పడమే అవుతుంది. ఇప్పుడయినా, భారత్, పాకిస్తాన్, బంగ్లాదేశ్ ప్రజలు—పాత ద్వేషాలను పాతిపెట్టి, కృత్రిమమైన ఎల్లలను చెరిపివేసి ఒకేదేశంగా ఏర్పడినట్టయితే మన ఉపఖండం ఆసియాలోనే గొప్ప శక్తిగా రూపొందవచ్చు!''

సాహసోపేతమైన ఈ అభిప్రాయం ఎంతయినా ఆలోచించతగినది!

సంపుటి 87    అక్టోబర్ '90    సంచిక 4

విడి ప్రతి : 3-00    : :    సంవత్సర చందా : 36-00






## వార్తలు–విశేషాలు:

# పశ్చిమ ఆసియాలో యుద్ధ మేఘాలు




పూర్వకాలంలో మెసపొటోమియా అని పిలువబడిన నైరుతి ఆసియాలోని ఈనాటి ఇరాక్ 4,35,120 చ. కి. మీ విస్తీర్ణం గల దేశం. సుప్రసిద్ధమైన ప్రాచీన బాగ్దాద్ నగరం దీని రాజధాని. ఎక్కువభాగం ఎడారి ప్రాంతం అయిన ఇరాక్‌లో టిగ్రిస్, యూఫ్రెటిస్ నదులు ప్రవహిస్తున్నాయి.

ఇరాక్‌ను ఆనుకుని వున్న కువైట్ చాలా చిన్న దేశం. 24,235 చ. కి. మీ. విస్తీర్ణంగల కువైట్ కూడా చాలావరకు, ఎడారి ప్రాంతమే. అయితే, ఈనాడు ప్రపంచంలోని ధనిక దేశాలలో కువైట్ ఒకటి. దేశం సంపన్నమయినదే కాని ఆ సంపదలన్నీ కొందరికే పరిమితం కావడంవల్ల ఇక్కడ అధిక సంఖ్యాకు లయిన సామాన్య ప్రజలు పేదరికంతో బాధపడుతున్నారు.

ఇరాక్‌కూ, కువైట్‌కూ ఆధారం ఆయిల్ క్షేత్రాలే. ప్రపంచ దేశాలు చాలా వరకు తమ ఆయిల్ అవసరాలకు అరబ్ దేశాల మీద ఆధారపడి ఉన్నాయి. ఆ కారణంగా ఈ దేశాలు రోజు రోజుకూ పెట్రోలు ధరలు పెంచుకుంటూ, మరింత ధనార్జన సాగిస్తున్నాయి.

1756 వ సం॥ నుంచి కువైట్‌ను షేక్ కుటుంబీకులు పరిపాలిస్తున్నారు. అందువల్ల ఈ దేశంలో అధికారమంతా ఒక్క కుటుంబానికి మాత్రమే పరిమితమై ఉన్నది. పాలకుణ్ణి అమీర్ అంటారు. యువరాజు ప్రధానమంత్రిగా ఉంటాడు.

నిజానికి కువైట్ తమ బాస్రా రాష్ట్రంలో ఒక భాగమేననీ, వలసవాదులయిన బ్రిటిష్‌వాళ్ళు దానికి ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించారనీ ఇరాక్ చాలా కాలంగా వాదిస్తున్నది. ఇంతకుపూర్వం కువైట్‌ను తమ దేశంతో కలుపుకోవడానికి ఇరాక్ ప్రయత్నించింది. కాని సఫలం కాలేదు. గత ఆగస్టు మాసారంభంలో హఠాత్తుగా ఇరాక్ సేనలు, చెప్పకోతగిన ప్రతిఘటన లేకుండానే కువైట్‌ను ఆక్రమించు కున్నాయి. రాజు అమీర్ సౌదీఅరేబియాకు పారిపోయాడు.

తమ సరిహద్దులో వున్న క్షేత్రాల నుంచి కువైట్ దొంగచాటుగా ఆయిల్‌ను అపహరిస్తున్నదని ఇరాక్ ఆరోపిస్తున్నది.

కువైట్, నిరంకుశుడైన రాజు పాలనలో ఉన్నది. ఇరాక్‌ను నియంత సద్దామ్ హుస్సేన్ పరిపాలిస్తున్నాడు. ఈ నియంత

శత్రువులమీద దారుణమైనమారణాయు
ధాలు ప్రయోగించడానికి సైతం వెనుదీసే
వాడు కాదు. ఒకవిధమైనమారణాయు
ధాన్ని ప్రయోగిస్తే ఆకాశమంతా పొగ
మేఘాలు కమ్ముకుంటాయి. వెల్లుల్లి
వాసనతో వున్న ఆ వాయులను పీల్చిన
వాళ్ళ ఒళ్ళు మంటలు ఏర్పడి మరణి


Kuwait's Ruler Emir Sheikh






స్తారు సరీన్ అనే మరొక వాయువుకు
వాసన లేదు గాని, దానిని పీల్చినట్టయితే
నిర్వీర్యులైపోయి చనిపోతారు!

ఇరాక్ కువైట్‌ను ఆక్రమించినవెంటనే
అమెరికా తన సేనలను ఇరాక్ సరిహద్దు
దేశమైన సౌదీఅరేబియాకు పంపింది.
ఇరాక్ నౌకలను అడ్డు తగలడానికీ,
కువైట్‌కు విముక్తి కలిగించడానికీ
అమెరికాప్రయత్నిస్తోంది. ఈవిషయంలో
ప్రపంచదేశాల మద్దతుకోసం ప్రయత్ని
స్తోంది. అయినా వేర్వేరు కారణాలవల్ల,
ప్రపంచదేశాలు ఇరాక్‌ను గట్టిగా
విమర్శించలేకపోతున్నాయి. అయినా,
అన్నిదేశాలూ సౌదీఅరేబియా ప్రాంతంలో
అమెరికా, ఇరాక్ దేశాలమధ్య యుద్ధం
రాకూడదనే కాంక్షిస్తున్నాయి.

ఇరాక్‌లోనూ, కువైట్‌లోనూ వున్న
వేలాదిమంది అమెరికన్లనూ, యూరోపి
యన్లనూ సద్దామ్ నిర్బంధంలోకి తీసు
కున్నాడు. అక్కడి లక్షలాది మంది
భారతీయులు కూడా బాధలకు లోనవు
తున్నారు. సౌదీఅరేబియా ప్రాంతంలో
ఏ నిమిషంలో ఏం జరుగుతుందో, ఏ
క్షణానయుద్ధంప్రారంభమవుతుందోతెలి
యని సంక్షోభస్థితి అలముకుని ఉన్నది.



# వినీలుడి పగ

మధుపురి అనే గ్రామంలో, వినీలుడనే యువకుడొకడుండేవాడు. వాడు చాలా అనాకారి. వాడికొక కాలు కుంటి, చేతులు మరీ సన్నగా ఎండుపుల్లల్లా వేళ్ళాడుతూండేవి. బక్కగా గాలికి ఎగిరిపోయేలా వుండేవాడు. చూసేవాళ్ళకు, వాడంటే ఏహ్యభావంతోపాటు, ఎంతో జాలి కూడా కలిగేది.

వినీలుడి తల్లి, వాణ్ణి ప్రసవించగానే మరణించింది. వాడు ఏడేళ్ళ వయసు వాడై వుండగా, తండ్రి పొలంలో పాము కాటుకు గురయి మరణించాడు. దానితో వినీలుడికి కష్టాలు ప్రారంభమయ్యాయి. వాడి మేనమామ కనకరాజు, వాడికి చెందవలసిన నాలుగెకరాల పొలం స్వాధీనం చేసుకున్నాడు. ఇందుకు ఊరి పెద్దలు కనకరాజును అదేమని ప్రశ్నించిన పాపాన పోలేదు.

శరీరంలో తగినంత శక్తి లేని కారణంగా, వినీలుడికి ఏదైనా పని చేసి పొట్ట పోసుకోవడం సాధ్యపడలేదు. వాళ్ళూ వీళ్ళూ దయతలిచి పెట్టిన నాలుగు మెతుకులు తిని కాలం గడుపుతూండేవాడు. ఆ గ్రామంలోనే వున్న సీతమ్మ అనే ముసలవ్వ, వినీలుణ్ణి కొంచెం ప్రేమగా చూసేది.

ఒకసారి సీతమ్మ వాడితో, ''ఒరే, బాబూ! మీ నాన్న సంపాయించి వదిలిపోయిన పొలం, న్యాయంగా నీకే చెందాలి. దాన్ని నీ మేనమామ అక్రమంగా స్వాధీనం చేసుకున్నాడు. నువ్వు ఆయన దగ్గిరకుపోయి, పొలం మీద వచ్చే పంటలో సగమైనా ఇవ్వమని అడుగు,'' అని చెప్పింది.

వినీలుడు మేనమామ దగ్గిరకు పోయి పొలం సంగతి అడిగాడు. అందుకు కనక

ఎస్. శివనాగేశ్వరరావు



వంద వరహాలు పెట్టి, "ఆ వినీలుడు నా మేనల్లుడే కావచ్చు—చూస్తున్నారు గదా, ఒట్టి అవిటివెధవ. వ్యవసాయం వాడివల్ల జరిగేపని కాదు. వాడికిప్పుడు ఇరవైఏళ్ళు. ఇంతకాలంగా ఎలా బతుకుతున్నాడో, ఇకమీదట కూడా అలాగే బతకనివ్వండి," అన్నాడు.

నారాయణదాసు, వినీలుణ్ణి దగ్గరకు పిలిచి, "నువ్వనే ఆ పొలం నీదికాదు, కనకరాజుది. లేనిపోని గొడవలు తేకు. పొలం గురించి మరొకసారి ఫిర్యాదు చేశావో, నిన్ను గ్రామం నుంచి బహిష్కరిస్తాను," అన్నాడు.

రాజు ఉగ్రుడైపోయి, "ఇక ఏనాడూ నా ఇంటి చాయలకు రాకు. నీకు పంటలో భాగం కాదు గదా, గుడ్డిగవ్వ కూడా ఇవ్వను జాగ్రత్త!" అని మెడపట్టుకుని గెంటేశాడు.

వినీలుడు, గ్రామపెద్ద నారాయణదాసు వద్దకు వెళ్ళి తనకు జరిగిన అన్యాయం గురించి చెప్పుకున్నాడు. నారాయణదాసు, కనకరాజును పిలిపించి, వినీలుడి ఫిర్యాదు గురించి చెప్పి, "ఇందుకు నీ జవాబేమిటి?" అని అడిగాడు.

కనకరాజు, నారాయణదాసును దూరంగా తీసుకుపోయి, అతడి చేతిలో

ఆ గ్రామంలో కాంతయ్య అనే పెద్ద రైతొకాయన వున్నాడు. ఆయనకు వసంత అనే కూతురుండేది. ఆమెది చాలా జాలి గుండె. గ్రామంలో అందరిచేతా అవమానింపబడుతూ, తిండిలేక పస్తులపాలవుతున్న వినీలుడంటే ఆమెకెంతో సానుభూతి. వీలయినప్పుడల్లా రహస్యంగా ఆమె, వినీలుడికి తినడానికేమైనా ఇస్తూండేది. క్రమంగా వసంతకు, వినీలుడిపట్ల గల సానుభూతి ప్రేమగా మారింది. వినీలుడు అనాకారేగాని తెలివిగలవాడు; బుద్ధిమంతుడు.

వసంత ఒకనాడు వినీలుడితో, "నిన్ను పెళ్ళాడ దలిచాను. నీకూ ఇష్టమే గదా?

ఈ సంగతి మా నాన్నతో చెప్పి, మన పెళ్ళి జరిగేలా చూడు.'' అన్నది చిన్నగా నవ్వుతూ.

ఇది విన్న వినీలుడు పరమానందం చెంది, వసంత తండ్రి కాంతయ్యతో సంగతి చెప్పాడు. కాంతయ్య ఉగ్రుడై పోయి, వాణ్ణి కర్రతోబాది వారం తిరక్కుండానే బలవంతంగా వసంత పెళ్ళి మరొకరితో జరిపించాడు.

ఇది జరిగాక వినీలుడు బతుకు మీద విరక్తి కలిగి, ఏ క్రూర మృగానికైనా ఆహారం అయిపోదామని, దాపులనున్న అరణ్యంలోకి వెళ్ళాడు.



ఆ అరణ్యంలో అభయుడనే ముని వున్నాడు. ఆయన వినీలుణ్ణి ప్రశ్నించి, సంగతి సందర్భాలు తెలుసుకుని, ''నాయనా, నువ్వు పుట్టినప్పటి నుంచి ఈనాటివరకూ నరకయాతనలు అనుభవించావు. సరే, ఇప్పుడు నీకొక సాయం చేయదలిచాను. నా దగ్గిర రెండు తిరుగులేని మంత్రాలున్నవి. అందులో ఒక మంత్రం మనసులో అనుకుంటే, ఎటువంటి వ్యక్తి అయినా నిన్ను చూసి భయపడతాడు. రెండవ మంత్రాన్ని జపిస్తే, ఎంత కఠిన హృదయులయినా నిన్ను ప్రేమించి ఆదరిస్తారు. అయితే, ఈ రెంటిలో నీకు ఒక్క మంత్రాన్ని మాత్రమే ఉపదేశించగలను. ఏ మంత్రం కావాలో కోరుకో!'' అన్నాడు.

వినీలుడికి తన ఆస్తి అపహరించిన మేనమామా, ఫిర్యాదు చేసినప్పుడు న్యాయం చేయని గ్రామపెద్ద నారాయణదాసూ, వసంత నుంచి తనను దూరం చేసిన కాంతయ్యా గుర్తుకు వచ్చారు. వాడికి వాళ్ళ మీద పగ తీర్చుకోవాలన్న ఆలోచన కలిగింది. వాడు మునిని, తనను చూసి ఎంతటివారైనా భయపడే మంత్రం ఉపదేశించమని కోరాడు. ముని అలాగే చేశాడు.

వినీలుడు తన గ్రామానికి వెళ్ళి, ముందుగా తన మేనమామ ఇంటి తలుపు

తట్టాడు. కనకరాజు తలుపు తెరిచి వినీలుణ్ణి చూసి మండిపడుతూ, "ఏరా, అవిటి వెధవా! చెప్పాను కదా, మళ్ళీ ఎందుకొచ్చావు? పొలం గురించి అడగడానికా?" అన్నాడు.

వినీలుడు జవాబు చెప్పకుండా ముని ప్రసాదించిన మంత్రం జపించాడు. ఆ మరుక్షణం, వినీలుడు కనకరాజుకు మహాకాయుడైన రాక్షసుడిలా కనిపించాడు. కనకరాజు నోటమాట రాక వణికిపోతూ కుప్పలా నేలకూలి మూర్ఛపోయాడు.

ఈ జరిగినదానికి వినీలుడు చాలా సంతోషించి, గ్రామ పెద్ద నారాయణదాసు కోసం రచ్చబండ దగ్గిరకు బయలుదేరాడు. పదిమంది మధ్య ఠీవిగా కూర్చుని ఏవో కబుర్లు చెబుతున్న నారాయణదాసుకు, తనకేసి వస్తున్న వినీలుడు నోటి నుంచి నిప్పులు కక్కుతున్న భయంకర మృగంలా కనిపించి, ఒక చావుకేక పెట్టి అక్కడినుంచి పారిపోయాడు.

ఆ తర్వాత వినీలుడు, పెద్ద రైతు కాంతయ్య పొలం వెళ్ళాడని తెలుసుకుని, అక్కడికి బయలుదేరాడు. అయితే, కాంతయ్య పొలం నుంచి తిరిగి వస్తూ వినీలుణ్ణి చూసి, బుసలుకొడుతున్న వంద తలల సర్పరాజులా భ్రమించి, చేతులు రెండూ జోడించి ఏదో అనబోయినవాడల్లా నోరు పెగలక నేల మీద బోర్లా పడిపోయాడు.



ఇప్పుడు వినీలుడికి, తనకు హాని చేసిన వారందరి మీదా పగ తీర్చుకున్నానన్న సంతృప్తి కలిగింది. వినీలుడు అరణ్యానికి పోయి, ఏవో మంత్రశక్తులు సాధించుకు వచ్చాడన్న వార్త గ్రామమంతా పాకి పోయింది. ఆనాటి నుంచి వాణ్ణి చూసి ప్రతి ఒక్కరూ భయపడిపోసాగారు. వాడు గ్రామంలోని ప్రధాన వీధిగుండా వస్తున్నాడంటే, జనం భయంతో సందులూ గొందుల్లోకి పోయి దాక్కునేవారు. ఇదంతా చూసి వినీలుడికి ఆనందంతోపాటు చాలా గర్వం కూడా కలిగింది.

ఇలా కొంతకాలం గడిచింది. క్రమేణా వినీలుడికి, తనను చూసి అందరూ భయపడుతూండడం కొంత అసంతృప్తి కారణం కాసాగింది. అలాంటి దశలో, ఒకనాటి సాయంత్రం, వాడు గ్రామం పక్కన వున్న మామిడితోటలోంచి వెళుతూండగా, అక్కడ ఆడుకుంటున్న చిన్న పిల్లల్లో ఒకడు, నేలబారుగా వున్న మామిడి కొమ్మ మీది నుంచి కిందపడి ఏడవ సాగాడు.

వినీలుడు చప్పునపోయి, వాణ్ణి ఎత్తుకుని, "ఏడవమాకు. దెబ్బ తగిలిందా?" అని అడిగాడు.

అయితే, ఆ పిల్లవాడు వణికిపోతూ "నన్ను వదిలెయ్యి!" అంటూ అరవ సాగాడు. వినీలుడు ఆశ్చర్యపోయి, "ఎందుకలా వణికిపోతున్నావు? నేనంటే భయమా?" అన్నాడు.



పిల్లవాడు ఇంకా వణికిపోతూ, "అవును భయం! నువ్వు మంత్రగాడివి. నన్నొదులు," అంటూ గింజుకోసాగాడు.

వినీలుడు వాణ్ణి అక్కడ వదిలి, తను సంపాయించిన మంత్రశక్తి కారణంగా, ప్రజలు తనంటే ఎంతగా భయపడుతున్నారో, వాళ్ళ దృష్టిలో తనెంత హీనుడైపోయాడో గ్రహించి, తల వంచుకుని విచారంగా ఇల్లు చేరాడు.

ఒక గంట గడిచీ గడవకుండానే, ఒకప్పుడు వాణ్ణి పెళ్ళాడదలచిన వసంత, వాడింటికి వచ్చి, "మన పెళ్ళికి అడ్డుపడ్డాడన్న కోపంతో, మా నాన్నకు మాట పడిపోయేలా మంత్రం ప్రయోగించావు. ఇంతకుముందు మామిడితోటలో ఆడుకుంటున్న నాకొడుకుతో ఏదో మాట్లాడావట! నీ పుణ్యముంటుంది. ఆ పసివాడి మీద ఎలాంటి మంత్రం ప్రయోగించకు," అంటూ వినీలుడి కాళ్ళ మీద పడింది.

వసంత మాటలకు వినీలుడు నివ్వెరపోయాడు. వాడి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. వాడు దుఃఖభారంతో అప్పటికప్పుడే అరణ్యానికిపోయి, అభయమునికి పాదాభివందనం చేసి, "మునివర్యా, ఎంతో అనుభవం తర్వాత, ఇన్నాళ్ళకు, నేను చేసిన తప్పు గ్రహించాను. అందరూ నన్ను నరరూపరాక్షసుడనుకుంటున్నారు. నేను నేర్చుకున్న మంత్రం మరిచిపోయేలా చేసి, అందరూ నన్ను అభిమానించే, గౌరవించే మంత్రం ప్రసాదించండి," అని వేడుకున్నాడు.

అభయముని చిరునవ్వునవ్వి, వినీలుడికి వాడు కోరిన మంత్రం ఉపదేశించి, ఆశీర్వదించాడు.

వాడి మనసులో ఇప్పుడు ఎవరిమీదా, పగా ద్వేషాల్లాంటివి లేవు. అయినా, వాడు తిరిగి తన స్వగ్రామానికి రాకుండా, ఎక్కడైనా దూరప్రాంతాన నలుగురి ఆదరణా, అభిమానాలతో కాలం వెళ్ళబుచ్చడం మేలనుకుంటూ, అరణ్యమార్గాన మరొక దిక్కుగా బయలుదేరిపోయాడు.






## 14

[అరణ్యమధ్యంలో రహస్యస్థావరాలు ఏర్పరచుకున్న తిరుగుబాటుదారులను ఏరిపారేయాలని, వీరసింహుడు వేట సాకుతో అడవికి వెళ్ళాడు. జయానందముని ఎంత వారించినా వినకుండా ఆగ్రహించి ఆయనను బంధించబోయాడు. మరుక్షణమే అరణ్య మృగాలన్నీ తరుముకోవడంతో, చావగా మిగిలిన సైనికులతో వీరసింహుడు రాజధానికి చేరాడు.—తరవాత]

అడవిలో జరిగిన. ఘోరపరాభవంతో వీరసింహుడు కొన్నాళ్ళపాటు సభకు రావడం మానేశాడు. ఆ సంఘటనతో వీరసింహుడి గర్వం అణిగింది. అంతకు ముందెన్నడూ అతడు మంచిచెడ్డలూ, ముందువెనుకలూ ఆలోచించేవాడు కాదు. కాని, ఇప్పుడు కాలం కలిసిరాకపోవడం వల్లే అన్నిటా అపజయం పాలవుతున్నట్టు భావించసాగాడు. ఇలా కొంతకాలం గడిచింది.

ఇంత జరిగినా, వీరసింహుడిలోని గర్వం కాస్త తగ్గిందిగాని అతడి దుష్ట స్వభావం మాత్రం మారలేదు. ఒకరోజు ఇద్దరు గూఢచారులు వచ్చి, వీరసింహుడి పథకాలకు అడ్డుతగిలే యువకులకు అమృతపురితో పాటు, శంకరవర్మ పాలిస్తూన్న చిన్న రాజ్యం జయపురినుంచి కూడా సహాయం లభిస్తున్నట్టు అతనికి తెలియజేశారు.



అమృతపురిని కబళించాలన్న వీరసింహుడి కోరిక నెరవేరలేదు. ఇకమీదట నెరవేరే అవకాశం లేదు. ఎందుకంటే, అమృతపురి ఇప్పుడు సైనిక బలాన్ని బాగా పుంజుకున్నది. రాజు అనారోగ్యం నుంచి పూర్తిగా కోలుకున్నాడు. ఇక, వీరసింహుడు కావాలంటే శంకరవర్మపై పగ సాధించవచ్చు!

''శంకరవర్మ తన సంపదలను చూసి తెగమురిసిపోతున్నాడు ప్రభూ! ఇటీవల ఒక రహస్యనిధి కూడా బయటపడింది. పూర్వుల శిధిలభవనాల తవ్వకాలలో కనకదుర్గరూపంలో వున్న అద్భుతమైన బంగారు విగ్రహం ఒకటి బయటపడింది. అది చాలా అందంగా వున్నది!'' అన్నాడు మంత్రి వీరసింహుడితో.

''ఆ విగ్రహం అందంగా ఉన్నదా? అందవిహీనంగా ఉన్నదా అన్నది మనకనవసరం. అది బంగారందయితే చాలు. బంగారం! బంగారం! అదీ మనకిప్పుడు కావలసింది. ధాన్యం మార్పిడికి ఆయుధాలు కొనాలన్న మన పథకం ఫలించలేదు. బంగారంతో అయితే సులభంగా కొనవచ్చు." అన్నాడు వీరసింహుడు.

దాపులనుంచి వారి సంభాషణలను వింటూన్న సేనాధిపతి సర్పదంతుడు, ''ప్రభూ! జయపురి మీదికి దండెత్తమని సెలవా!'' అని అడిగాడు.

''ఛీ, ఛీ! పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా! కుందేలును వేటాడడానికా నిన్ను సేనాధిపతిని చేశాము! జయపురికి సైన్యమే లేదు. దానిసరిహద్దులను ఒకవైపు సుమేధ, మరొకవైపు అమృతపురి రక్షిస్తున్నాయి. అంతే కాదు; మనం జయపురి మీదికి దండెత్తినట్టయితే, దానిని రక్షించడానికి అమృతపురి సేనలు రావచ్చు. వాటిని ఎదుర్కొనేశక్తి నీ సైన్యానికి ఉన్నదా?'' అని అడిగాడు వీరసింహుడు.

ఏమి చెప్పడానికీ తోచక సర్పదంతుడు నేలచూపులుచూడసాగాడు. వీరసింహుడు మళ్ళీ, ''అందుకే మనం జయపురి మీదికి

దండెత్త కూడదు. అయితే, ఆ రాజ్యానికి మనం ఎంతోకాలంగా రక్షణ కల్పిస్తున్నాము కాబట్టి, శంకరవర్మ నుంచి కప్పం వసూలు చేయవచ్చు. ఇప్పుడే ఆ విషయం శంకరవర్మకు తెలియజేద్దాం. మన ఆజ్ఞను ధిక్కరించే ధైర్యం శంకరవర్మకు ఉండదనుకుంటాను," అన్నాడు.

* * *

జయపురిలో ఎక్కడ చూసినా ప్రజలు ఆనందోత్సాహాలతో ఉన్నారు. పురాతన భవన శిథిలాల నుంచి అద్భుతమైన బంగారు విగ్రహం ఒకటి బయటపడింది. నిగనిగలాడే ఆ బంగారు విగ్రహం మీద చిన్న గీర కూడా లేదు. దానిని చూసి శంకరవర్మ పరమానందం చెంది, ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి చిన్న గుడి ఒకటి కట్టించాడు. ఆ గుడిలో విగ్రహం ప్రతిష్ఠించడానికి తగిన ముహూర్తం కూడా నిర్ణయించారు.

శంకరవర్మ ఉద్యానవనంలో ఉన్నప్పుడు ఒక భటుడు అక్కడికి వచ్చి నమస్కరించి, "ప్రభూ, శాంతిపురం నుంచి దూతవచ్చాడు!" అన్నాడు.

"శాంతిపురం నుంచి దూతా! అంటే వీరసింహుడే పంపాడన్నమాట!" అని ఒక్క క్షణం ఆగి, "సరే ఇక్కడికి తీసుకురా," అన్నాడు శంకరవర్మ.



కొంతసేపటికి దూత ఒకడు వచ్చి, శంకరవర్మకు నమస్కరించి, "ప్రభూ, వీరసింహమహారాజు మీకు తమ శుభాకాంక్షలు తెలియజేసి, వారికి చేరవలసిన బాకీ గురించి గుర్తు చేయమన్నారు," అన్నాడు.

"బాకీ గురించా! మేము ఎవరికీ బాకీ అంటూ ఏదీ లేదే!" అన్నాడు శంకరవర్మ.

"సుమేధరాజ్యం సమకూర్చే రక్షణ కారణంగానే మీ రాజ్యం శత్రువుల వశం కాకుండా సురక్షితంగా ఉన్నది. అందువల్ల మీరు మా రాజ్యానికి కప్పం చెల్లించవలసిందిగా మా రాజుగారు మీకు తెలియజేయమన్నారు," అన్నాడు దూత.



"అలాగా!" అని శంకరవర్మ కొంత సేపు మౌనం వహించి, ఆ తరవాత, "సరే, మీ రాజు మా నుంచి ఆశిస్తున్న దేమిటి?" అని అడిగాడు.

"మీకు లభించిన కనకదుర్గ స్వర్ణ విగ్రహాన్ని ఇచ్చినట్టయితే మా ప్రభువులు సంతోషిస్తారు!" అన్నాడు దూత.

ఆ మాట విని శంకరవర్మ ఉలిక్కి పడ్డాడు. కాని తన అదురుపాటు బయటకు కనిపించకుండా, "ఆ కనకదుర్గ విగ్రహాన్ని మీ రాజుకే కాదు; మరెవ్వరికి ఇవ్వడానికీ నాకు అధికారం లేదు. మేము కొత్తగా కట్టిన గుడిలో ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠించాలనుకున్నాము. అయినా, ఆ గుడి చాలా చిన్నది. మరొక పెద్ద ఆలయం నిర్మించి, ఆ విగ్రహాన్ని అందులోకి మార్చాలనుకుంటున్నాము. త్వరలో ఆలయ నిర్మాణం పూర్తిచేసి, విగ్రహ ప్రతిష్ఠాపన ఉత్సవానికి సుమేధ పాలకులనూ, అమృతపురి పాలకులనూ ఆహ్వానించగలం!" అన్నాడు.

"ప్రభూ, మా రాజుగారు పంపిన సందేశాన్ని మీకు తెలియజేయడం దూతగా నా బాధ్యత. 'ఆ విగ్రహాన్ని మర్యాదగా మాకు అప్పగించు. లేదా దానిని మేమే బలవంతంగా తీసుకుపోతాం!' ఇదీ మా రాజుగారి సందేశం," అన్నాడు దూత తల వంచుకుని.

శంకరవర్మ ఆకాశం కేసి చూస్తూ, "అదా సంగతి! ఆ విగ్రహాన్ని అప్పగించడానికి నేను సిద్ధంగా లేనని మీ రాజుకు తెలియజెయ్యి. కావాలంటే, కొంత ధనం చెల్లించగలం. అది కూడా అన్యాయమైన కోరికకు తలవంచడమే అవుతుంది. ఈనాటివరకు సుమేధను పరిపాలించిన ధర్మప్రభువు లెవ్వరూ ఇలా మా నుంచి ఏదీ ఆశించలేదు. ఇక నువ్వు వెళ్ళవచ్చు!" అన్నాడు.

దూత శంకరవర్మకు నమస్కరించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

* * *

దూత సుమేధరాజ్య సరిహద్దులోకి ప్రవేశించి, వీరసింహుడి ఆజ్ఞ ప్రకారం అక్కడ సైనికులతో సిద్ధంగా వున్న సర్పదంతుడితో, శంకరవర్మ బంగారువిగ్రహాన్ని అప్పగించడానికి తిరస్కరించిన విషయం చెప్పాడు. సర్పదంతుడు, వెంటనే దళనాయకులతో, ''ఈ క్షణమే మనం జయపురి రాజభవనం కేసి బయలుదేరాలి. అక్కడ మనల్ని ఎదుర్కొనే వాళ్ళెవ్వరూ వుండరనుకుంటాను. అయితే....'' అని ఇంకేదో చెప్పబోయేంతలో ''ఆగు!'' అన్న గంభీరకంఠస్వరం వినిపించింది.



సర్పదంతుడు కోపాశ్చర్యాలతో చుట్టుపక్కలకలయచూశాడు. చిన్నచిన్నచెట్లూ, పొదలూ తప్ప అక్కడ మరేమీ కనిపించలేదు. మరుక్షణమే పొదల చాటునుంచి ఒక బాణం దూసుకువచ్చి, సర్పదంతుడి ఎదుట నేలపై గుచ్చుకున్నది. సర్పదంతుడు ఆ బాణాన్ని అందుకుని, దాని కొసకు వున్న లేఖను తీసి చదివాడు: ''జయపురి ప్రజల శాంతికి భంగం కలిగించకండి. శంకరవర్మను వదిలి తిరిగి వెళ్ళమని హెచ్చరిస్తున్నాము. ఇది యువరాజు సందీపుడి ఆజ్ఞ!''

యువరాజు సందీపుడు! ఇంతకు పూర్వం వచ్చిన హెచ్చరికలలో పేరు వుండేది కాదు. ఇప్పుడు తిరుగుబాటుదారులకు కొత్తగా నాయకుడు ఏర్పడ్డాడన్న మాట! ఎవడీ యువరాజు సందీపుడు? సర్పదంతుడి మనసులో ఆశ్చర్యంతో పాటు భయం కూడా ప్రవేశించింది. తనను వెన్నంటి శత్రువులు వస్తున్నారని తెలిసీ, తను సైనికులను ఎలా నడపడం? సర్పదంతుడికి గుండె దడదడలాడసాగింది. అయినా, తిరిగి వెళదామన్నా అక్కడ వీరసింహుడి ఆగ్రహం నుంచి తప్పించుకోవడం సాధ్యం కాదు. ముందుకు వెళ్ళడం ఒక్కటే మార్గం! అందువల్ల, అతడు సైనికులను, ''కదలండి ముందుకు!'' అని ఆజ్ఞాపించాడు.



ఆ రోజు సాయంకాలం జయపురి ప్రజలు విగ్రహ ప్రతిష్ఠాపనకు ఏర్పాట్లు చేయడంలో నిమగ్నులై వున్నారు. శంకరవర్మకు వీరసింహుడు పంపిన బెదిరింపు గురించి వాళ్ళకేమీ తెలియదు. పున్నమి రోజయిన రేపే విగ్రహ ప్రతిష్ఠాపన!

హఠాత్తుగా పరాయి సైనికదళాలు తమ రాజభవనం కేసి నడవడం చూసి, జయపురి ప్రజలు అమితాశ్చర్యం చెందారు. కొందరు, కొంత దూరంలో, ఆ దళాన్ని వెంబడించి వెళ్ళారు. ఒక యువకుడు పరుగెత్తిపోయి సంగతిని రాజుకు తెలియజేశాడు. రాజు శంకరవర్మ భవనం నుంచి వెలుపలికి వచ్చాడు. అలోగానే సర్పదంతుడు అక్కడికి వచ్చాడు. అతనితో శంకరవర్మ, "మీకు ఏం కావాలి?" అని అడిగాడు.

"కనకదుర్గ బంగారు విగ్రహం!" అన్నాడు సర్పదంతుడు.

"ఆ విగ్రహాన్ని వదులుకోలేనని మీ దూతతో చెప్పి పంపాను కదా!" అన్నాడు శంకరవర్మ.

"వదులుకునేట్టు మేము చేస్తాం; అవసరమయితే బలప్రయోగంతో లాక్కుపోతాం!" అన్నాడు సర్పదంతుడు.

శంకరవర్మ కొంతసేపు మౌనంగా ఆలోచించి, "ఏమాత్రం రక్తపాతం జరగడమూ నాకు ఇష్టం లేదు. మీ ఇష్టానుసారం ఏం చేయాలో చేయండి," అన్నాడు.

గూఢచారులు సర్పదంతుణ్ణి, భవనంలో కుడివైపున ఉన్న ఒక గది లోపలికి తీసుకుపోయారు. అక్కడ వున్న బంగారు విగ్రహాన్ని, సర్పదంతుడి ఆజ్ఞ ప్రకారం, ఇద్దరు సైనికులు కష్టపడి ఎత్తుకున్నారు. అప్పుడు వీరసింహుడు పంపిన దూత ఒకడు వచ్చి సర్పదంతుడి చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు. తిరుగుబాటు దార్లవశం కాకుండా బంగారు విగ్రహాన్ని భద్రంగా సుమేధ రాజధానికి చేర్చే ఉపాయం వీరసింహుడు చెప్పిపంపాడు. నదీమార్గంలో ప్రయాణం సాగించినట్టు

యితే తిరుగుబాటుదార్లు నదిలోకి దూకి, అంత సులభంగా అడ్డుపడలేరని వీర సింహుడు భావించాడు. వీరసింహుడు చెప్పి పంపినప్రకారం సర్పదంతుడు విగ్రహంతోసహా నదీతీరం చేరాడు.

అదొక పాయలాంటి చిన్న నది. ఒక చిన్న పడవలో ఇద్దరు భటులు విగ్రహాన్ని పట్టుకుని కూర్చున్నారు. నలుగురు పడవను తెడ్లతో నడపడం ప్రారంభించారు. పడవకు సమీపంలో నదికి ఇరువైపులా ఆయుధాలు ధరించి సైనికులు నడవ సాగారు. సర్పదంతుడు వారి వెంట విజయ గర్వంతో నడవసాగాడు.

కొంతదూరం వెళ్ళాక, ఒకచోట నదికి రెండువైపులా బ్రహ్మండమైన మర్రి వృక్షాలు వున్నాయి. వాటి కొమ్మలు నది మీదికి విస్తరించి ఉన్నాయి. సైనికులు మర్రివృక్షం కిందికి వచ్చినప్పుడు కొంత దూరంలో వింతశబ్దంతో బాణాసంచా పేలడం కనిపించింది. సైనికులందరూ ఆశ్చర్యంతో అటు కేసి చూశారు. సరిగ్గా అదే సమయంలో మర్రివృక్షం పైనుంచి భూతం లాంటి ఆకారం తమ మీదికి రావడం, రెప్పపాటులో తమ వద్ద వున్న బంగారు విగ్రహం మాయం కావడం గమనించి పడవలోనివాళ్ళు దిగ్భ్రాంతి చెందారు. ఒక యువకుడు మర్రికొమ్మకు కట్టిన బలమైన తాడును ఒక చేత్తో పట్టుకుని తమ మీదికి దూకి, మరొక చేత్తో బంగారు విగ్రహాన్ని అవలీలగా ఎత్తుకునిపోయి అవతలిగట్టు చేరాడు. ఇవతలిగట్టున వున్న భటులు ఇంకా బాణా సంచా వేడుకను చూస్తూనే ఉన్నారు.

పడవలోని భటులు, "బందిపోటు! బందిపోటు!" అని అరిచేలోగా బంది పోటు నదికి అవతలిగట్టున సిద్ధంగా ఉన్న గుర్రాన్ని ఎక్కి అరణ్యంలోకి వెళ్ళిపోయాడు.

సైనికులు, కనుచూపు దూరంలో గుర్రంపై అడవిలోకి మాయమైపోయిన ఆ ఆకారం కేసి అమితాశ్చర్యంతో చూస్తూ అలాగే వుండిపోయారు.—(ఇంకావుంది)






# మంజీరకథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి సమయాన, ఒళ్ళు జలదరింపజేసే ఈ వాతావరణంలో, నువ్వు ఎంతో కర్తవ్యనిష్ఠతో వ్యవహరించడం చూస్తూంటే, నిన్ను ప్రశంసించాలని అనిపిస్తున్నది. అయితే, చాలామంది ఏదో ఒక బలహీనక్షణంలో, ఏదో ఒక భావావేశానికి లొంగి, తమ కర్తవ్యాన్ని, కార్యదీక్షనూ కూడా విస్మరించి ప్రవర్తించడం మనం తరుచూ చూస్తూనే వుంటాం. ఎంతో వివేకం, సమయజ్ఞతా కలదని పదిమంది చేతా ప్రశంసలు పొందిన ఒకానొక రాజకుమార్తె, ఇటువంటి బలహీనత చేతనే తన తండ్రినీ, రాజ్యాన్నీ శత్రువు

## బేతాళ కథలు



పరంచేసిన గాథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం కౌశాంబిదేశాన్ని, ధీరసింహుడనే రాజు పాలిస్తూండేవాడు. ఆయనకు పుత్రసంతానం లేదు, ఒకేఒక్క కుమార్తె. ఆమె పేరు మంజీర. కూతురునే సర్వస్వంగా భావించిన ధీరసింహుడు ఆమెకు సకల శస్త్రాస్త్ర విద్యలు నేర్పించడమేగాక, పరిపాలనలో కూడా భాగస్వామిని చేశాడు.

రాజ్యపాలనలో, తండ్రితో భాగస్వామ్యం వహించిన మంజీరకు, తండ్రితో బాటు వేటకు వెళ్ళడంకూడా అలవాటుగా వుండేది. ఒక్కొక్కసారి తండ్రి లేకుండా, తానొక్కతే ఒక చెలికత్తెనూ, ఒక అంగరక్షకుణ్ణీ మాత్రం వెంటబెట్టుకుని వేటకు వెళుతూండేది.

ఒకసారి మంజీరకు వెంట ఎవరూ లేకుండా, తానొక్కతే ఒంటరిగా వేటకు వెళ్ళిరావాలన్న కోరిక కలిగింది. ఆమె అత్యంత సన్నిహితురాలైన చెలికత్తెకు మాత్రం సంగతి చెప్పి, కౌశాంబికి సమీపానగల అరణ్యానికి బయలుదేరింది.

అరణ్యంలో పగలంతా వేటాడిన మంజీర, మృగయా వినోదంలోపడి, సాయంత్రమయేసరికి అరణ్యం చివరి భాగానికి చేరుకుని, దారి తప్పింది. బాగా చీకటిపడడంతో, ఏం చెయ్యాలో తోచక మంజీర, ఒక్కక్షణం గుర్రాన్ని నిలిపింది.

ఇంతలో ఆమెకు సమీపం నుంచి, "ఎవరు మీరు?" అన్న ప్రశ్న వినిపించింది. నిర్జనమైన ఆ అరణ్యంలో ఆ ప్రశ్న విని, ఉలిక్కిపడిన మంజీర, చప్పున ప్రశ్న వినవచ్చినవైపు తలతిప్పి చూసింది. దాపులనున్న పొదల చాటు నుంచి ఒక వ్యక్తి, బయిటికి వచ్చాడు. జడలుకట్టిన శిరోజాలూ, నిండుగడ్డమూ తప్ప, మసక వెన్నెలలో అతడి ముఖరేఖలు మంజీరకు స్పష్టంగా కనిపించలేదు.

ఇతడెవరు? ఈ నిర్జనారణ్యంలో రాత్రి సమయంలో ఎందుకుంటున్నాడు?

అన్న అనుమానం, రాజనీతి విషయాల గురించి తరచుగా ఆలోచించే మంజీర మనస్సును, క్షణకాలంలో పెనుభూతంలా ఆక్రమించింది.

ఆమె కంఠస్వరం మార్చి, "నేనొక సైనికుణ్ణి, స్వామీ! యువరాణి అజ్ఞానుసారం, ఈ ప్రాంతం వేటకు అనుకూలంగా వుంటుందా లేదా అన్న పరిశీలనకోసం వచ్చి, దారితప్పి అల్లాడుతున్నాను. తమరెవరో తెలుసుకోవచ్చునా?" అని ప్రశ్నించింది.

ఆ ప్రశ్న వింటూనే అవతలి వ్యక్తి చిత్రంగా నవ్వి, "ఎవరైతేనేం? ఈ రాత్రికి నాకు అతిథిగా వుండి, తెల్లవారి వెళ్ళవచ్చు. నగరానికి దారి నేను చూపించగలను," అంటూ ముందుండి దారి తీశాడు.

మంజీర క్షణకాలం సందేహించినా, సహజమైన తెగింపుతో, అతడి వెంట గుర్రాన్ని నడిపించింది.

అపరిచిత వ్యక్తి తిన్నగా ఒక కుటీరానికి దారి తీశాడు. అక్కడ ఎత్తయిన చెట్లూ, దట్టంగా పొదలూ వుండడంతో, అంతా కటికచీకటిగా వున్నది. అతడు కుటీరం లోపలికి వెళ్ళి, కాగడా ఒకటి వెలిగించి పట్టుకువచ్చాడు. మంజీర ఊహించినదానికి భిన్నంగా, అతడి ముఖం అంతులేని రాజసమూ, శౌర్యమూ ఉట్టిపడుతూ, ఎవరైనాసరే చప్పున కళ్ళు తిప్పుకోలేని విధంగా వున్నది.





తనకేసి ఆశ్చర్యపోతూ చూస్తున్న మంజీరతో, ఆ వ్యక్తి, "తెల్లవారేందుకు ఇంకా చాలా వ్యవధి వున్నది. చాలా అలసిపోయి వుంటారు. ముందు కాస్త విశ్రాంతి తీసుకోండి, యువరాణీ!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే పురుషవేషంలో వున్న మంజీర ఉలిక్కిపడి, "యువరాణి! ఏమిటి మీరంటున్నది?" అంటూ ఏదో చెప్పబోయింది.

అంతలోనే ఆ యువకుడు, ఆమెను మృదువుగా వారిస్తూ, "ప్రస్తుతం మీరు నాకూ, నేను మీకూ ఎటువంటి అసత్యాలూ పలికే పరిస్థితిలో లేమన్న విషయం— రాజనీతి, లౌకికజ్ఞానమూ గల మీకు వేరే చెప్పనవసరం లేదు. ముందు నా ఆతిథ్యం స్వీకరించి విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

మంజీర ఇక పెదవివిప్పలేకపోయింది. మౌనంగా ఆ యువకుడు చెప్పినచోట కూర్చుని, అతడు ఇచ్చిన పళ్ళు తిని, పాలు తాగింది.

"ఇక ఇప్పుడు కానివ్వండి, మీ పరీక్షలు!" అన్నాడు యువకుడు నవ్వుతూ.

అందుకు మంజీర, "మీరెవరో, ఏదో ఉత్తమాశయంతో, ఈ నిర్జనప్రదేశాన్ని ఎన్నుకున్నట్టు కనిపిస్తున్నది. మీరు విషయమంతా చెబితే, నాకు వీలైన సాయం నేను చేస్తాను," అన్నది.

ఆమె మాటలకు అతడు చిన్నగా నవ్వి, "తర్వాత మాట తప్పరుగదా?" అన్నాడు.

"నేను మాట తప్పడమా? అసంభవం!" అన్నది మంజీర.

"సరే, వినండి. నా పేరు విజయదత్తుడు!" అని ఆగాడు యువకుడు.

ఆ పేరు వింటూనే నిశ్చేష్టురాలైంది, మంజీర. ఆమెకు వెంటనే దాదాపు నాలుగు సంవత్సరాలక్రితం జరిగిన సంఘటనలు జ్ఞప్తికి వచ్చాయి.

కౌశాంబికి ఉత్తరాన గల అరణ్యం దాటితే, చందనదేశమనే చిన్న దేశం ఒకటి

వున్నది. అది తరతరాలుగా కౌశాంబి రాజులకు సామంతరాజ్యంగా వుంటూ వస్తున్నది. నాలుగు సంవత్సరాల క్రితం, చందనదేశాన్ని పాలిస్తున్న విరూపాక్ష దత్తుడు, సమయానికి కప్పం కట్టని కారణంగా, ధీరసింహుడు ఆ దేశాన్ని యుద్ధంలో కైవశం చేసుకున్నాడు. అవమానం భరించలేని విరూపాక్షదత్తుడు ఆత్మహత్య చేసుకోగా, అతడి రాణి సహగమనం చేసింది.



అయితే, యుద్ధ సమయానికి ఎక్కడో దూరప్రాంతాల్లో దేశాటన చేస్తున్న, విరూపాక్షుని ఏకైక పుత్రుడు విజయదత్తుడికి మాత్రం, హఠాత్తుగా జరిగిన యుద్ధమూ, దాని పరిణామాలూ వెంటనే తెలియలేదు. అతడికి తెలిసిన తర్వాత, తనమీదికి దండెత్తిరావచ్చునన్న అనుమానంతో, ధీరసింహుడు చాలాకాలం అప్రమత్తంగా వుండి, గూఢచారులచేత విజయదత్తుడి కోసం వెతికించాడు. అయినా, అతడి జాడ తెలియలేదు.

ప్రతి విషయంలోనూ తన సలహా అడిగే తండ్రి, ఈ విషయంలో తనను సంప్రదించకపోవడం, హఠాత్తుగా చందనదేశాన్ని ఆక్రమించుకోవడం, మంజీరకు ఆశ్చర్యం కలిగించడమేగాక, అన్యాయంగా కూడా తోచింది.

కాని, ధీరసింహుడు ఆమె మాటను కొట్టిపారేస్తూ, "నీకు తెలియదు, తల్లీ! విరూపాక్షుడు కప్పం కట్టకపోవడం, ఇది మొదటిసారి కాదు. ఇప్పటికి చాలాసార్లు అతణ్ణి క్షమించాను. వచ్చిన రాబడి అంతా దానధర్మాలకూ, కళాపోషణకూ ఖర్చు చెయ్యడం సార్వభౌమునికి చెల్లుతుంది గాని, సామంతరాజుకు చెల్లదు!" అన్నాడు.

తన పేరు వింటూనే, మంజీర ఆలోచనలో పడడం గమనించిన విజయదత్తుడు గంభీరంగా, "మీకు సందేహమేమీ అక్కర లేదు, మంజీరాదేవీ! మీరు ఆక్రమించుకున్న చందనదేశపు యువరాజు విజయదత్తుణ్ణి నేనే!" అన్నాడు.



చాలా కలవరపరిచింది. పరిస్థితులు అనుకూలించిననాడు, విజయదత్తుడికి సైనిక సహాయం చేసేందుకు వినయసేనుడు ఒప్పుకున్నాడు.

అరణ్యంలో, రాకుమారి మంజీరతో పరిచయం అయిన తర్వాత, నెల తిరక్కుండానే, విజయదత్తుడి నాయకత్వాన కోసలదేశపు సైన్యాలు, హఠాత్తుగా మందాకినీ నది దాటి వచ్చి, కౌశాంబి మీద దాడి చేశాయి. యుద్ధంలో రాజు ధీరసింహుడు చిత్తుగా ఓడిపోయాడు.

అయితే, విజయదత్తుడు రాజకుటుంబాన్ని ఏమీ అవమానించలేదు సరికదా, ధీరసింహుణ్ణి సకల రాజమర్యాదలతోనూ గౌరవిస్తూ, "రాజా, పగతీర్చుకోవడం, నా అభిమతం కాదు. కేవలం నా మాతృభూమి మీదా, నా తల్లిదండ్రుల మీదా నాకున్న అభిమానంతోనే, నేనీపని చేశాను. నాకు కావలసింది, నా దేశానికి స్వాతంత్ర్యం మాత్రమే. కౌశాంబిని యథాప్రకారం, మీరే ఏలుకోండి!" అన్నాడు.

విజయదత్తుడి మంచితనానికి ధీరసింహుడు చలించిపోయి, "నాయనా, నీ తండ్రికి నేను చేసిన అన్యాయానికి శిక్షగా, పన్నెండు సంవత్సరాలపాటు, నేనే నీకు సామంతుగా వుంటాను. అంతే కాక, నా రాజ్యంలోని అత్యంత విలువైన

ఆ మాటలు వింటూనే, మంజీర ఒక్కసారి తలఎత్తి అతడివైపు చూసి, వెంటనే తలవంచుకున్నది. తెల్లవారిన తర్వాత విజయదత్తుడు, ముందుండి దారి చూపుతూ, ఆమెను నగరపొలిమేరల వరకూ తీసుకువచ్చి, తిరిగివెళ్ళిపోయాడు.

కౌశాంబికి పొరుగురాజ్యమైన కోసలకు, వినయసేనుడు రాజు. అతడూ, విజయదత్తుడి తండ్రి అయిన విరూపాక్షదత్తుడూ ఒకే గురుకులంలో చదువుకోవడమేగాక, ఇద్దరూ మంచి మిత్రులు. ధీరసింహుడు, విరూపాక్షుడి రాజ్యభాగాన్ని ఆక్రమించుకోవడం, అవమానాన్ని భరించలేక అతడు ఆత్మహత్య చేసుకోవడం, వినయసేనుణ్ణి

దాన్ని దేనినైనా, నీకు కానుకగా ఇస్తాను. ఏం కావాలో అడుగు,'' అన్నాడు.

దానికి విజయదత్తుడు నవ్వి, ''అడిగి తీసుకునేది కానుక అనిపించుకోదు! అయినా, మీకు ప్రతి విషయంలోనూ, మీ కుమార్తెను సంప్రదించడం అలవాటు కదా. నాకివ్వబోయే కానుక ఏదైతే బావుంటుందో, ఆమెతో మాట్లాడి, మీరే నిశ్చయించండి,'' అన్నాడు.



తండ్రి చెప్పగా అంతా విన్న మంజీర, ''నాన్నా, మీరు అతనికి కానుక ఇవ్వబోయేది వ్యక్తిగానా, రాజుగానా?'' అని ప్రశ్నించింది.

ధీరసింహుడు ఒక్క నిమిషం ఆలోచించి, ''రాజుగా కాదు, వ్యక్తిగా అతడి ఔన్నత్యానికి ఆనందపడి, ఏదైనా అపురూపమైన కానుక ఇవ్వాలనుకుంటున్నాను,'' అన్నాడు.

మంజీర చిన్నగా నవ్వి, తల వంచుకుంటూ, ''వ్యక్తిగా మీరొక తండ్రి! తండ్రికి కన్నబిడ్డ కంటే విలువైనదీ, అపురూపమైనదీ వేరే ఏముంటుంది, నాన్నా?'' అన్నది.

ధీరసింహుడు, కుమార్తె మాటలకు ఒక్కక్షణం తెల్లబోయి, వెంటనే ఆమె అంతర్యం గ్రహించి పెద్దగా నవ్వుతూ, ''అవునమ్మా, నిజమే! విజయదత్తుడు కూడా ఇందుకే, నీ సలహా అడగమని వుంటాడు. సరే, ఈ నా వెలలేని రత్నాన్ని అతడికి కానుకగా ఇస్తాను!'' అన్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే మంజీరా, విజయదత్తులకు మహావైభవంగా వివాహం జరిగిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, విజయదత్తుడి రూపసౌందర్యాలకు లొంగిపోయిన మంజీర, కావాలనే అతడి గుట్టు తండ్రికి చెప్పకుండా దాచిందన్న విషయం నిజమే కదా? విజయదత్తుడు మంచివాడు కాబట్టి సరిపోయింది, లేనిపక్షంలో ధీరసింహుడి కుటుంబం అడవులపాలు కావలసిందేగదా? అంతటి రాజనీతిజ్ఞతా,

తెలివితేటలూ గల మంజీర, ఒక చిన్న బలహీనతకు లొంగి, బాధ్యతారహితంగా ప్రవర్తించడం, ఏమంత సమంజసం? అలాగే, తనగుట్టుతెలుసుకున్న మంజీరను నిర్లక్ష్యంగా వదిలిపెట్టిన విజయదత్తుడు కూడా కొద్దిలో ప్రమాదం తప్పించుకున్నాడు, అవునా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మూర్ఖుడికి పది మాటల్లో చెబితేగాని బోధపడని విషయాన్ని, తెలివైనవాడు ఒక్క మాటలోనే గ్రహిస్తాడు. మేధావులకు ఆ ఒక్క మాట కూడా అవసరం లేదు, కేవలం ఒక్క చూపు చాలు. మంజీరా, విజయదత్తు లిద్దరూ మేధావులే. ఇద్దరూ మౌనంగానే, ఒకరి మీద ఒకరికి కలిగిన అనురాగాన్ని గ్రహించుకున్నారు. మంజీర తనను గురించి తండ్రికి చెప్పదన్న విషయం, విజయదత్తుడికి తెలుసు. ఆ కారణంవల్లనే అతడు, ఆమెను అరణ్యం నుంచి వెళ్ళనిచ్చాడు. ఇక మంజీర, కేవలం విజయదత్తుడి మీద గల వ్యామోహంతోనే, తన బాధ్యతను విస్మరించలేదు. విజయదత్తుడు, మందాకినీనది పక్కనే గల అరణ్య ప్రదేశంలో కుటీరం నిర్మించుకోవడంవల్ల, అతడికి కోసల దేశపురాజు అండదండలుండి తీరగలవని, మంజీర సులభంగానే గ్రహించింది. తాను వెళ్ళి తండ్రికి అంతా చెప్పి, సైన్యాన్ని తీసుకు వచ్చేలోపల, విజయదత్తుడు నది దాటి, ఆవలనున్న కోసలరాజ్యం చేరడం అతి సులభం. అందువల్లనే, తాను చేయగలిగిందేమీ లేదని ఆమె గ్రహించి, భవిష్యత్తును కేవలం విజయదత్తుడి మంచితనానికి వదిలిపెట్టి, అన్ని విధాలా విజయాన్ని సాధించుకున్నది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : లక్ష్మీగాయత్రి రచన]



# చందమామ అనుబంధం—24

## మన విజ్ఞాన సంపద

### ఎవరామె?

16వ శతాబ్దారంభంలో గుజరాత్‌ను పరిపాలించిన బహదూర్ షా పెద్ద సైన్యంతో మేవార్ రాజధాని చిత్తోర్ కోటను ముట్టడించాడు. దురదృష్టవశాత్తు ఆ సమయంలో మేవార్ రాజు వ్యాధిగ్రస్తుడై వున్నాడు. అందువల్ల ఏం చేయడమా అని, ఆస్థాన ఉద్యోగులూ, ప్రముఖులూ ఒక గదిలో గుమిగూడి చర్చించసాగారు. ఒక ప్రముఖుడు, "మన సైన్యాన్ని నడపడానికి నాయకులెవ్వరూ లేరు. కాబట్టి ఓటమి తప్పదు!" అన్నాడు విచారంగా.

అ గదికి అవలనున్న కిటికీ నుంచి ఒక స్త్రీ గంభీర కంఠస్వరం వినిపించింది: "మన సైన్యం కన్నా శత్రువుల సైన్యం పెద్దది. వాళ్ళు మన కోటను పట్టుకోవడానికి సకల సన్నాహాలతో వచ్చారు కాబట్టి, మనకు ఓటమి సంభవించవచ్చు. అయితే, చిత్తోర్ కోట రక్షణకు నాయకత్వం కరువయిందన్న కళంకం రానీయకూడదు. రండి, నేనే నాయకత్వం వహిస్తాను!"

ఇలా అంటూ చేతఖడ్గం ధరించి ఒక వీరవనిత వెలుపలికి వచ్చింది.

ఎవరామె?

(36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. ఇండొనేషియా, మలేయా దీవులలో గొప్ప రాజ్యం స్థాపించిన హైందవ రాజు ఎవరు?
2. ఆయన రాజధాని ఏది?
3. బౌద్ధమతం స్వీకరించి దాని ప్రచారానికి పాటుపడిన మొట్టమొదటి టిబెట్ రాజు ఎవరు? ఆయన ఎప్పుడు అలా చేశాడు?
4. ఆయన నిర్మించిన నగరం ఏది?
5. భారతదేశానికి ఆయన పంపిన రాయబారి ఎవరు?

(36 వ పేజీ చూడండి)

# శ్రావస్తి నగరం

ఈనాటి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో, రాప్తి నదీతీరంలోని సహేత్‌మహేత్ గ్రామ శివార్లలో పురాతన శ్రావస్తినగరశిథిలాలు బయటపడ్డాయి. ఆ నగరాన్ని ఇక్ష్వాకు వంశపు రాజయిన శ్రావస్తుడు నిర్మించడంవల్ల దానికి ఆ పేరు వచ్చింది. మన పురాణేతిహాసాలలో, ముఖ్యంగా బౌద్ధవాఙ్మయంలో శ్రావస్తినగర ప్రసక్తి చాలా చోట్ల కనిపిస్తుంది.

గౌతమబుద్ధుడి కాలంలో ఈ నగరం కోసలరాజ్యానికి రాజధానిగా ఉండేది. ప్రసేనజిత్తు పాలించేవాడు. విశాలమైన వీధులతో, అందమైన ఉద్యానవనాలతో, తామరతటాకాలతో తీర్చిదిద్దినట్టు కళకళలాడే సుందరనగరం శ్రావస్తి అని చెబుతారు. వాణిజ్యకేంద్రమైన ఆ నగరంలో పలువురు వాణిజ్యప్రముఖులు నివసించేవారు. వారిలో గౌతమబుద్ధుడి శిష్యుడుగా మారిన సుదత్తుడు ముఖ్యుడు. సుదత్తుడి ప్రార్థనమేరకే గౌతమబుద్ధుడు ఈ నగరానికి విజయం చేసి, జేతవనంలో కొన్నాళ్ళు గడిపాడు. ఉత్తరోత్తరా ఇక్కడొక పెద్ద బౌద్ధ విహారం కూడా నిర్మించబడింది.

అంగుళీమాలు డనే భయంకరమైన బందిపోటు—బాటసారులను దోచుకుని అంతటితో వదలక వాళ్ళ బొటనవేళ్ళను తెగ నరికి మెడలో మాలగా ధరించేవాడు. వెయ్యి బొటనవేళ్ళను మాలగా ధరించాలని ప్రతిన బూనాడు. రాజు ప్రసేనజిత్తు బందిపోటును బంధించాలని ఆలోచించసాగాడు. ఆ విషయాన్ని వాడికి తెలియజేయడానికి అంగుళీమాలుడి తల్లి అడవికి వచ్చింది. తను అనుకున్న వెయ్యి బొటనవేళ్ళకు ఒక్కటి మాత్రమే తక్కువ కాబట్టి తల్లి బొటనవేలునే తెగనరకడానికి పూనుకున్నాడా దుర్మార్గుడు. సరిగ్గా ఆ సమయానికి అక్కడికి వచ్చిన గౌతమబుద్ధుడు, తన బోధనలతో అంగుళీమాలుడిలో హృదయపరివర్తన తీసుకువచ్చి, వాణ్ణి అహింసామార్గానికి మళ్ళించాడు. వాడు పశ్చాత్తాపపడి బుద్ధుడి



# చందమామ కబుర్లు




శిష్యుడయ్యాడు. అంగుళీమాలుడు బౌద్ధ భిక్షువులాగా శ్రావస్తినగర వీధులలో భిక్షాటనం చేస్తుండగా, నగర పౌరులు అతణ్ణి బందిపోటని గుర్తించి, బంధించబోయారు. కాని అంగుళీమాలుడు ఏ మాత్రం ఎదురు తిరగలేదు. వాళ్ళ చేత మౌనంగా దెబ్బలు తిని, శాంతంగా ప్రాణాలు వదిలాడు!

సహేత్‌మహేత్ గ్రామ పరిసరాలలో భూగర్భం నుంచి బయటపడుతూన్న శిథిలాలు శ్రావస్తినగర గత వైభవాన్ని గుర్తు చేస్తున్నాయి!

## బాధను తట్టుకోగల శక్తి!

గాయం, వ్యాధి మొదలైనవి శారీరక బాధలను కలిగిస్తాయి కదా. అయితే, ఒకేవిధమైన వ్యాధీ, గాయాలూ అందరికీ ఒకే విధమైన బాధలను కలిగించడం లేదు. భిన్నమైన మానసికస్థితులే దీనికి కారణం. ఓహియో విశ్వవిద్యాలయంలో కుందేళ్ళపై జరిపిన పరిశోధనలో ఈ విషయం వెల్లడయింది. ప్రేమతో పెంచిన కుందేళ్ళు మిగతా కుందేళ్ళకన్నా బాధను సునాయాసంగా తట్టుకోగలిగాయి!





## ఎస్. ఎస్. సి. పరీక్షలు రాసే ఎనిమిదేళ్ళ అమ్మాయి!

పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి చెందిన మౌసమీ చక్రవర్తి అనే ఎనిమిదేళ్ళ అమ్మాయి ఎస్. ఎస్. సి. పరీక్షలకు చదువుతున్నది. అపూర్వమైన తెలివితేటలు ప్రదర్శిస్తూన్న ఈ అమ్మాయి, పరీక్షాసంఘం నుంచి ప్రత్యేక అనుమతి లభించినట్టయితే ఈ పరీక్షలకు కూర్చుంటుంది!

# సాహిత్యావలోకనం

1. ఈజిప్టుకు సంబంధించిన అతి ప్రాచీనమైన గ్రంథం ఏది?
2. 'చరిత్ర రచనకు పితామహుడు' గా పేరు గాంచిన వారెవరు?
3. ఫ్రెంచి విప్లవానికి ప్రేరణ కలిగించిన రచయిత ఎవరు?
4. ఆయన రచనల ప్రత్యేకత ఏమిటి?
5. 19వ శతాబ్దంలో అత్యంత ప్రాచుర్యం పొందిన ఫ్రెంచి నవల ఏది? దాని రచయిత ఎవరు?

## సమాధానాలు

ఎవరామె?

మేవార్ రాణి కార్నావతి

లోకజ్ఞానం

1. శ్రీ విజయుడు.
2. సుమత్ర లోని పాలెమ్‌బ్యాంగ్
3. స్ట్రాంగ్సన్ గ్యాంపో; 7వ శతాబ్దంలో.
4. టిబెట్ రాజధాని లాసా.
5. తోన్మిశంభోత్ర; ఆయన భారతదేశం నుంచి బౌద్ధ మత గ్రంధాలనూ, దేవనాగరి లిపినీ టిబెట్‌కు తీసుకు వెళ్ళాడు.

సాహిత్యం

1. 'మృతులగ్రంథం'
2. హెరొడోటస్
3. వాల్టేర్
4. వ్యంగ్యప్రధానం
5. విక్టర్ హ్యూగో రచించిన 'లెస్ మిసరబుల్స్'



# శ్రీ రామకృష్ణపరమహంస

## (5)

తను బోధించాలనుకున్న వేదాంత రహస్యాలన్నిటినీ, శ్రీ రామకృష్ణ అద్భుతమైన వేగంతో గ్రహించడం గమనించి తోతాపురి అమితాశ్చర్యం చెందాడు.

ఈ కాలఘట్టంలో రామకృష్ణ కొన్ని చిత్రమైన అద్వైత అనుభూతులకు లోనుకాసాగాడు. ఒకనాడు ఆయన నదీ తీరంలో కూర్చుని, పడవలో ఒక ప్రయాణీకుడు మరొక ప్రయాణీకుణ్ణి కొట్టడం చూసి బాధతో కేక వేశాడు. అంతేకాదు; ఆయన వీపు మీద గాయాలు కూడా కనిపించాయి!





తోతాపురి చూపిన మార్గంలో అద్వైత అనుభూతులను చవిచూసిన అనంతరం, రామకృష్ణ ఇస్లాం మత బోధనల పట్ల ఆకర్షితుడయ్యాడు. ముస్లిం భక్తుడి లాగా దీక్షతో సాధన చేసి ఆ మార్గంలోనూ తృప్తిపొందాడు.



ఒకసారి మాధుర్‌బాబు కాశీయాత్రకు వెళుతూ, శ్రీ రామకృష్ణను కూడా తమ వెంట రమ్మన్నాడు. ఆయన కోరిక మేరకు శ్రీ రామకృష్ణ, వారితో కలిసి కాశికి పడవలో ప్రయాణమయ్యాడు. పడవ వారణాసిని సమీపిస్తూన్నప్పుడు ఆ నగరం, రామకృష్ణకు బంగారు నగరంగా కనిపించింది. భౌతిక కాశీ నగరానికి ఆధారంగా ఉన్న ఆధ్యాత్మిక కాశిని ఆయన దర్శించాడన్నమాట!

కాశీవిశ్వనాథఆలయాన్నీ, కేదారనాథ మందిరాన్నీ దర్శించినప్పుడు, రామకృష్ణ తన్నుతాను మరచిన ధ్యానంలో నిమగ్నుడైపోయాడు. అందరి లాగా కేవలం కళ్ళకు కనిపించే బాహ్య రూపాలను కాకుండా, ఆయన విగ్రహాల లోని దైవాంశలను దర్శించాడు.





వారణాసిలోని నాటి గొప్ప సాధువులలో ఒకరైన త్రైలింగస్వామిని కూడా రామకృష్ణ సందర్శించాడు. ఆయనకు గొప్ప శక్తులుండేవి గానీ, చూడడానికి పసిబిడ్డలాగా వుండేవాడు. ఆయనలో శివాంశను దర్శించి, రామకృష్ణ ఆయనకు ప్రేమతో పాయసం అందించాడు!

శ్రీ రామకృష్ణ వద్ద వుంటూ ఆయన అవసరాలు చూసే, మేనల్లుడు హృదయ్, ఒకసారి స్వగ్రామంలో వున్న తమ గృహంలో దుర్గాపూజ చేయాలనుకుని రామకృష్ణను ఆహ్వానించాడు. రామకృష్ణ అక్కడికి వెళ్ళలేదు గాని, పూజా సమయంలో అక్కడ వుంటానని మాట ఇచ్చాడు. పూజాసమయంలో నిజంగానే, దుర్గాదేవి సమీపంలో శ్రీ రామకృష్ణను దర్శించి హృదయ్ అమితానందం చెందాడు.





1871వ సం॥ జూలై నెలలో రాణి రాస్మాని వారసుడయిన మాధుర్‌బాబు తీవ్రంగా వ్యాధిగ్రస్తుడయ్యాడు. అప్పుడాయన కాళీఘట్‌లో ఉన్నాడు. ఒక రోజు రాత్రి దక్షిణేశ్వరంలో వున్న రామకృష్ణ ధ్యానంలో కూర్చుని, కళ్ళు తెరిచి తన భక్తుడు మరణించాడని తెలియజేశాడు. ఆ సమయానికి, కాళీఘట్ నుంచి మాధుర్‌బాబు మరణవార్త రాలేదు!

1872వ సం॥ శ్రీ రామకృష్ణుడి సతీమణి శారదాదేవి దక్షిణేశ్వరానికి వచ్చింది. ఆ మహాపురుషుడికి తగిన అర్ధాంగిగా తను కూడా ఆధ్యాత్మిక జీవితం సాగించాలని ఆమె నిర్ణయించుకుని, భర్త పాదాల ముందు తనను సమర్పించుకున్నది.





ఒకనాటి రాత్రి శ్రీ రామకృష్ణ శారదా దేవిని దేవతగా భావించి ఆమెను పువ్వులతో మంత్రయుక్తంగా పూజించాడు. నిజానికి, ఆయన ఆమెకు కొన్ని ఆధ్యాత్మిక శక్తులను ప్రసాదించాడు. ఆ శక్తులను స్వీకరించడానికి శారదాదేవి పాత్రురాలయింది!

రామకృష్ణకు బైబిల్‌పట్ల కూడా ఆసక్తి వుండేది. ఒకనాడు, శిశువుగా వున్న ఏసును ఎత్తుకుని వున్నట్టున్న మేరీమాత చిత్రపటాన్ని శ్రీ రామకృష్ణ చూశాడు. ఒక విధమైన ప్రకాశం ఆ చిత్రపటం నుంచి వచ్చి రామకృష్ణలో ప్రవేశించినట్టు గ్రహించి ఆయన పరమానందం చెందాడు.





ఇది జరిగిన మూడు రోజుల తరవాత, శ్రీ రామకృష్ణ ఒక చెట్టుకింద కూర్చుని వున్నప్పుడు, ఒక తేజోపురుషుడు వచ్చి ఆయనను ప్రేమతో కౌగిలించుకుని ఆయనలో లీనమైపోయాడు. ఆ తేజోమూర్తి భగవంతుడి అవతారమైన ఏసుక్రీస్తు అని శ్రీ రామకృష్ణ భావించాడు. —(ముగింపు వచ్చే సంచికలో)



# మహారాజయోగం

బుందేల్‌ఖండ్‌లో ఒకప్పుడు ఠాకుర్ వంశంవారు ప్రసిద్ధిగా పరిపాలించారు. ఆ వంశానికి చెందిన రూపసింహుడనే వాడు కడు పేదవాడు. అతనికి ధనంగాని, ఆస్తి గాని, చివరకు బంధువులుగాని లేరు. అతనికున్న ఆస్తియావత్తూ చినిగిపోయిన దుస్తులూ, రెండు గోనెపట్టాలూ, ఒక గొడ్డలీ మాత్రమే.

ఈ గొడ్డలితో రూపసింహుడు ఉదయం నుంచి మధ్యాన్నందాకా అడవిలో కట్టెలు కొట్టి, వాటిని తెచ్చి మూడు రూపాయలకు అమ్ముకునేవాడు. అందులో రెండు రూపాయలు ఖర్చుపెట్టి చాకలివాళ్ళదగ్గిర రాజులు ధరించే దుస్తులు అద్దెకు తీసుకునే వాడు. మరొక రూపాయకు గుర్రం ఒకటి అద్దెకు తీసుకునేవాడు. ఆ బట్టలు ధరించి గుర్రంఎక్కి, వాయువేగంతోనగరపువీధుల వెంట రాజఠీవితో సవారీఅయి వెళ్ళేవాడు. మంచి యువకుడూ, అందగాడూ అయిన ఈ వ్యక్తిని చూసి అందరూ అతనెవరో రాజనుకునేవారు.

ఈ విధంగా రూపసింహుడు ప్రతిరోజూ ఠాకుర్ రాజవంశ గౌరవాన్ని నిలబెట్టి, చీకటిపడగానే దుస్తులనూ, గుర్రాన్నీ తిరిగి ఇచ్చివేసి, తన మామూలు దుస్తులు ధరించి, చిల్లర డబ్బులతో ఇన్ని మరమరాలూ, శనగపప్పూ కొని తిని, కాసిని మంచినీళ్ళు తాగి, ఒక గోనెపట్టా నేలమీద పరుచుకుని, మరొకటి మీద కప్పుకుని హాయిగా నిద్రపోయేవాడు. తిరిగి మర్నాడు ఉదయం గొడ్డలి భుజాన పెట్టుకుని కట్టెలు కొట్టటానికి అడవికి బయలుదేరేవాడు.

ఒకనాడు రూపసింహుడు అడవిలో కట్టెలు కొడుతూ ఉండగా అతనికి సమీపం నుంచి సువాసన తగిలింది. సమీపానికి వెళ్లి

బుందేల్‌ఖండ్ జానపద కథ



చూసేసరికి అక్కడ మంచి గంధపుచెట్టు కనిపించింది. రూపసింహుడు గొడ్డలితో మంచి గంధపుచెట్టు బెరడు కొంత చెక్కి తీసుకుని, యథాప్రకారం కట్టెలు కొట్టుకుని సాయంకాలానికల్లా నగరానికి తిరిగి వచ్చాడు.

ఆ సాయంకాలం రూపసింహుడు రాజదుస్తులు ధరించి గుర్రంమీద ఎక్కివాయు వేగంతో సవారీ అయిపోతూండగా నగరపు కూడలిలో ఒక పరదేశి అతనికి ఎదురై వినయంగా, "నమస్కారం, మహాప్రభూ!" అన్నాడు.

"ఎవరవోయ్ నీవు?" అని ఠీవిగా ప్రశ్నించాడు రూపసింహుడు.

"ప్రభూ, నేను వ్యాపారం చేసుకునే వాణ్ణి. తమదేశంలో వ్యాపారం ముగించుకొని సింహళానికి పోతున్నాను," అని విన్నవించుకొన్నాడు పరదేశి.

రూపసింహుడు తన జేబులోనుంచి గంధపుచెట్టు బెరడు తీసి, పరదేశికియిస్తూ, "ఠాకుర్ రూపసింహుడి కానుకగా దీనిని సింహళరాజుకు అందచెయ్యి నీపని సానుకూలం అవుతుంది!" అని, తన గుర్రాన్ని అదిలించి శరవేగంతో వెళ్ళిపోయాడు.

ఆ ప్రకారమే వర్తకుడు రూపసింహుడి కానుకను సింహళరాజుకు అందజేశాడు. గంధపుచెక్క ఎరగని సింహళరాజు ఠాకుర్ రూపసింహుడి కానుకకు ముగ్ధుడై, వర్తకుడికి సమస్త సదుపాయాలూ చెయ్యటమే గాక, అతనిద్వారా రూపసింహుడికిరత్నాలు పొదిగిన పాదుకలు బహుమానంగా పంపాడు.

ఆ వర్తకుడు తిరిగివచ్చి రూపసింహుడి కొరకు నగరు కూడలిలో వేచివుండగా రూపసింహుడు గుర్రం మీద వచ్చాడు.

"నమస్కారం, మహాప్రభూ!" అన్నాడు వర్తకుడు.

"ఎవరవోయ్ నీవు?" అన్నాడు రూపసింహుడు, గుర్రం ఆపి.

"మహాప్రభూ, నేను పరదేశి వ్యాపారిని. తాము పంపిన కానుక సింహళరాజుకు

అందజేశాను. ఆయన తమ కీ పాదుకలు పంపారు,'' అన్నాడు వర్తకుడు.

''నీవిప్పుడు ఏ దేశానికి పోతున్నావు?'' అని అడిగాడు రూపసింహుడు.

''అరేబియాదేశం వెళ్ళుతున్నాను,'' అన్నాడు వర్తకుడు.

''అయితే అరేబియా చక్రవర్తికి ఈ పాదుకలను మా కానుకగా బహూకరించు. నీ పని సానుకూలమవుతుంది,'' అంటూ రూపసింహుడు గుర్రాన్ని అదిలించి, శర వేగంతో వెళ్ళిపోయాడు.

వర్తకుడు అలాగే చేశాడు. అరేబియా చక్రవర్తి రత్నాలు పొదిగిన పాదుకలు చూసి, అటువంటి అమూల్యమైన కానుక పంపిన రాజు సామాన్యుడై వుండడని భావించాడు. అరేబియాదేశపు గుర్రాలు ఉత్తమాశ్వాలు. అటువంటి అశ్వాలలో ఉత్తమోత్తమమైనవి నూరు తెప్పించి చక్రవర్తి వర్తకుడికి ఇచ్చాడు.

''రూపసింహ ఠాకుర్‌గారికి మా సలాములు చెప్పి, ఈ నూరు గుర్రాలు మా కానుకగా వారికి అందచెయ్యి. వారు పంపిన కానుక ఆనందాన్ని కలిగించింది," అని చక్రవర్తి వర్తకుడికి చెప్పాడు.

వర్తకుడు ఆ నూరు గుర్రాలనూ శ్రద్ధగా వెంటపెట్టుకుని వచ్చి మామూలుప్రకారం కూడలిలో నిలబడ్డాడు. త్వరలోనే రూపసింహుడు గుర్రంమీద వాయువేగంతో వచ్చి వర్తకుణ్ణి చూసి ఆగాడు.



వర్తకుడు నూరు అరేబియా గుర్రాలనూ చూపి, ''మహాప్రభూ, అరేబియా చక్రవర్తి మీకు వీటిని కానుకగా పంపారు. స్వీకరించండి!'' అన్నాడు.

''నీ విప్పుడు ఏ దేశం పోతున్నావు?'' అని అడిగాడు రూపసింహుడు.

''నేను తిరిగి సింహళం పోతున్నాను,'' అన్నాడు వర్తకుడు.

''అయితే వీటిని తీసుకుపోయి సింహళ రాజుకు మా కానుకగా ఇయ్యి,'' అంటూ రూపసింహుడు అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయాడు.

అతడు చెప్పిన విధంగానే వర్తకుడు నూరు అశ్వాలనూ సింహళరాజుకు సమర్పించి, అది రూపసింహ ఠాకుర్ కానుక అని విన్నవించాడు.

ఈ కానుక చూడగానే సింహళరాజు హృదయం ద్రవించింది. రూపసింహుడు పంపే కానుకలు అమూల్యమైనవే గాక, అతని స్నేహం మరింత విలువైనదిగా కనిపించింది. రూపసింహుడు యువకుడనీ, అందగాడనీ వర్తకుడివల్ల విని సింహళ రాజు తన ఏకైక పుత్రికను అతనికిచ్చి పెళ్ళిచేయ తలపెట్టాడు. రూపసింహుడి కొరకు రాజోచితమైన దుస్తులూ, ఆభరణాలూ ఇచ్చి, పెద్ద పరివారాన్ని వర్తకుడి వెంట పంపాడు.

రూపసింహుడి నివాస స్థానం తెలియని కారణంచేత వర్తకుడు సింహళ రాజు పంపిన పరివారాన్ని నగరపు కూడలిలో వుంచాడు. సాయంకాలం కాగానే రూపసింహుడు గుర్రం మీద వాయు వేగంతో వచ్చాడు.

వర్తకుడు రూపసింహుడికి తాను తెచ్చిన సందేశం అందజేశాడు. రూపసింహుడు, సింహళరాజు పంపిన వస్త్రాభరణాలు తీసుకొని, మర్నాడు అదేచోట కలుస్తానని వర్తకుడికి చెప్పి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు రూపసింహుడు తన అరువు దుస్తులనూ, గుర్రాన్నీ ఇచ్చివేసి, సింహళ రాజు పంపిన దుస్తులనూ, ఆభరణాలనూ ధరించి ఆ రోజు కట్టెలమ్మగా వచ్చిన డబ్బుతో మేనా చేయించుకొని సాయంకాలానికి కూడలికి చేరాడు. అక్కడ అతని కోసం వర్తకుడూ, సింహళరాజు పరివారమూ సిద్ధంగా ఉన్నారు. అందరూ కలిసి సింహళ దేశానికి ప్రయాణమై వెళ్ళారు.

సింహళ రాజకుమార్తెకూ రూపసింహుడికీ వైభవంగా వివాహం జరిగింది. సింహళ రాజుకు కుమారులు లేనందున, కాలక్రమాన రూపసింహుడే సింహళానికి రాజై చాలాకాలం పరిపాలించాడు.






గజపుష్పి లతను సుగ్రీవుడు తన మెడకు చుట్టుకున్న తరవాత రాముడు అతన్ని వెంటబెట్టుకుని కిష్కింధకు వెళ్ళాడు. అతని వెంట ధనుస్సూ, బాణాలూ ఉన్నాయి. రాముడికి ముందు సుగ్రీవుడూ, లక్ష్మణుడూ నడిచారు; అతని వెనకగా వీరుడైన హనుమంతుడూ, నళుడూ, నీలుడూ, తారుడూ నడిచారు.

దారిలో రాముడికి దట్టమైన చెట్లతో కూడిన ఒక మహారణ్యం కనబడింది. అతను సుగ్రీవుణ్ణి ఆ అరణ్యం గురించి అడిగాడు.

సుగ్రీవుడు నడుస్తూనే ఇలా చెప్పాడు: "ఇది ఒకప్పుడు ఆశ్రమం; చల్లని నీడగల చెట్లతోనూ, రుచిగల కందమూల ఫలాలతోనూ ఉండేది. ఇందులో సప్త జనులనే ఋషులు తపస్సు చేసి శరీరాలతోనే స్వర్గానికి వెళ్ళిపోయారు. ఇప్పుడు ఇందులోకి ఎవరూ ప్రవేశించలేరు; పక్షులూ, జంతువులూ కూడా ప్రవేశించలేవు. ఒక వేళ లోపలికిపోయినా, తిరిగి బయటికి రాలేవు. ఇందులో నుంచి అప్సరసలు నాట్యం చేసే ధ్వనులూ, పాడే ధ్వనులూ ఎప్పుడూ వినవస్తూంటాయి; వివిధజాతుల పూలచెట్ల నుంచి మంచి సువాసనలు కూడా వస్తాయి. చెట్ల పైభాగాల మీద మసి కనిపిస్తున్నది గదా, దానికి కారణం ఏమంటే, ఇందులో సర్వకాలాలలోనూ త్రేతాగ్నులు వెలుగుతూంటాయి."

5. వాలివధ

ఈ మాట విని రామలక్ష్మణులు సప్త జనులను తలచుకుని, ఆ అరణ్యానికి నమస్కారం చేశారు.

అక్కడి నుంచి చాలాదూరం నడిచి వాళ్ళు కిష్కింధను సమీపించి చెట్ల చాటున దాక్కున్నారు.

సుగ్రీవుడు ఒక్కసారి చుట్టూ కలయజూసి, గట్టిగా గొంతెత్తి, వాలిని యుద్ధానికి పిలిచాడు. తరవాత అతను రాముడితో, ఈసారైనా మాట నిలబెట్టుకో మన్నాడు.

"నీ మెడకు లత ఉన్నది గనక నిన్ను తేలికగా గుర్తించగలను. వాలిని ఒకే ఒక బాణంతో కూల్చుతాను. నువ్వు భయపడకు. నేను ఎంత కష్టంలో కూడా అబద్ధం ఆడినవాణ్ణి కాను. ఇక ముందు కూడా ఆడను. నువ్వు ఏమాత్రం భయపడక వాలిని గట్టిగా పిలువు," అన్నాడు రాముడు.

సుగ్రీవుడు ఆకాశం దద్దరిల్లేటట్టు భయంకరంగా అరిచాడు. ఆ ధ్వని విని పశువులు బెదిరాయి, వనంలో తిరిగే లేళ్ళు చప్పున నిలిచిపోయాయి.

ఈ సింహనాదాన్ని అంతఃపురంలో ఉన్న వాలి విన్నాడు. తనను చూసి హడలిపోయే సుగ్రీవుడికి ఇంత ధైర్యమా అని వాలికి పట్టరాని ఆగ్రహం కలిగింది. అతను వెంటనే యుద్ధానికి బయలుదేరి వచ్చాడు.

వచ్చేస్తున్న వాలిని తార ఆపి, "సుగ్రీవుణ్ణి చంపటానికి ఈ రాత్రి



వేళ వెళ్ళాలా? తెల్లవారి వెళ్ళవచ్చు. ఇందులో పౌరుషం ప్రసక్తిలేదు. అతను నీతో సమానమైన బలం కలవాడు కాడు. నేను ఎందుకు వెళ్ళవద్దంటున్నానో చెబుతాను. ఒకప్పుడు నీ చేత చావు దెబ్బలు తిని పారిపోయినవాడు మళ్ళీ నీ మీదికి కయ్యానికి వచ్చాడంటే, అతనికి ఎవరి సహాయమో ఉండి ఉంటుంది. లేకపోతే అతను రానేరాడు. 'అతనికి ఎవరి సహాయం ఉన్నా నేను చంపగలను,' అని అనుకోకు. సుగ్రీవుడు తెలివిగలవాడు; తనకు సహాయం వచ్చే వాళ్ళ శక్తిసామర్థ్యాలు చక్కగా పరీక్షించి గాని రాడు. నీ కన్న పరాక్రమవంతుణ్ణి సహాయం తీసుకునే వచ్చి ఉంటాడు. అంగదుడు అరణ్యంలోకి వెళ్ళి తిరిగి వచ్చి ఒక సమాచారం తెచ్చాడు. ఇక్ష్వాకువంశం వాళ్ళూ, దశరథుడి కొడుకులూ అయిన రామలక్ష్మణులు ఋశ్యమూకం మీదికి వచ్చారుట. మహాబలపరాక్రమ సంపన్నులైన ఆ అన్నదమ్ములు సుగ్రీవుడికి సహాయంగా ఉన్నారుట. ఆ రాముడు విరాధుణ్ణీ, ఖర, దూషణులనూ, కబంధుణ్ణీ చంపి ఉన్నాడుట," అన్నది.

తార వాలికి ఈ విధంగా సలహా కూడా ఇచ్చింది:

"రాముడితో విరోధం పెట్టుకునే కన్న సుగ్రీవుడితో స్నేహం చేసుకో. అతన్ని పిలిచి మళ్ళీ యువరాజుగా చెయ్యి.





నీ రక్తం పంచుకున్నవాడే గాని, పరాయి వాడు కాడు గద! నీ మంచి కోరే నేనీ మాట చెబుతున్నానని తెలుసుకో.''

కాని ఆమె మాటలు మహాబలశాలి అయిన వాలికి రుచించలేదు. అతను తారతో ఇలా అన్నాడు:

''సుగ్రీవుడు ఒక వంక నన్ను యుద్ధానికి పిలుస్తూంటే నేను సహించనా? పిరికి దానివి, నీకేమీ తెలియదు. మహా శూరులకు యుద్ధంలో వెనక్కు తీయటం చావు కన్న హీనం. రాముణ్ణి గురించి భయపడకు. అతను నిరపరాధినైన నన్ను చంపి పాపం కట్టుకోడు. నా మేలుకోరే నువ్వు మాట్లాడావు. నా వెంటరాకు. నేను సుగ్రీవుడి మదం అణుస్తానుగాని, చంపను. నా దెబ్బలకు తట్టుకోలేక వాడే పారిపోతాడు.''

తార ఇంకేమీ చెప్పక, వాలికి ప్రదక్షిణం చేసి, యుద్ధంలో అతనికి జయం కలిగించే మంత్రాలు చదివి, తన స్త్రీలతో సహా వెనక్కుపోయింది.

తరవాత వాలి ముందుకు పోయి, తనతో యుద్ధానికి సిద్ధంగా ఉన్న సుగ్రీవుణ్ణి చూశాడు. తాను కూడా సుగ్రీవుడిలాగే నడుము బిగించి, పిడికిలిపట్టి సుగ్రీవుడి మీదికి వెళ్ళాడు. సుగ్రీవుడు కూడా పిడికిలి బిగించి వాలి మీదికి వచ్చాడు.

ఇద్దరూ ఒకరినొకరు పిడికిళ్ళతో పొడుచుకున్నారు. సుగ్రీవుడు ఒక సాల వృక్షం పెరికి, దానితో వాలిని కొట్టాడు. వాలి ఆ దెబ్బకు కొంత చలించాడు. అయితే, క్రమంగా వాలి బలం కన్న సుగ్రీవుడి బలం వేగంగా క్షీణించసాగింది.

సుగ్రీవుడి బలం తగ్గుతూండటమూ, అతను మధ్య మధ్య దిక్కులు చూడటమూ గమనించి, రాముడు వాలిని చంపటానికి అనువైన బాణం ఎన్నుకుని, తన ధనుస్సుకు ఎక్కుపెట్టి, చెవిదాకా లాగి వదిలాడు. అది పెద్ద ధ్వనితో వెళ్ళి, వాలి రొమ్ములో గుచ్చుకున్నది. దాని



దెబ్బకు దిమ్మరపోయి వాలి పడి పోయాడు.

ఇంద్రుడిచ్చిన కాంచనమాల వాలి కంఠంలో ఉండిన కారణం చేత, అతని ప్రాణాలు వెంటనే పోలేదు. అతను తనను కొట్టిన వాడికోసం కళ్ళతో వెతుకుతూంటే, లక్ష్మణుడితో సహా రాముడు వాలి దగ్గిరికి వచ్చాడు. అప్పుడు వాలి రాముణ్ణి చూసి ఇలా అన్నాడు:

''నువ్వు మహారాజు కొడుకువు. గుణవంతుడని కీర్తి తెచ్చుకున్నావు. శాస్త్రం తెలిసినవాడివి. గొప్ప వంశంలో పుట్టావు. బలశౌర్యాలు గలవాడివి. నేను మరొకరితో యుద్ధం చేస్తూండగా నా రొమ్మును బాణంతో కొట్టావే, ఇందువల్ల నీకేం గొప్పతనం వచ్చింది? నువ్వు పొంచి ఉండి నన్ను కొట్టుతావని కూడా నాకు తెలియదే! రాజులకు ఉండవలసిన గుణాలు ఇంద్రియ నిగ్రహమూ, చిత్తశుద్ధీ, ఓర్పూ, సత్యమూ, ధర్మమూ, పరాక్రమమూ, దుష్టశిక్షణా—ఇవి నీలో ఉన్నాయని నమ్మి, తార వద్దంటున్నా యుద్ధానికి వచ్చాను. నువ్వు దుర్బుద్ధివనీ, పాపాచారుడివనీ, లోక వంచకుడవనీ, గ్రహించలేకపోయాను. నీకు గాని, నీ దేశానికి గాని నేనేమీ అపకారం చెయ్యలేదు. నిన్ను అవమానించలేదు. నీతో యుద్ధానికి రాలేదు. మరెవరితోనో యుద్ధం చేస్తున్న నన్ను నువ్వు ఎందుకు కొట్టావు? నన్ను వేట ధర్మంగా కొట్టావనుకునేటందుకు కూడా లేదు; నా చర్మంతో గాని, రోమాలతో గాని, ఎముకలతో గాని, మాంసంతో గాని నీకు పనిలేదు. నీవంటి రాజులవల్ల భూమి చక్కగా పాలించబడదు. నీవంటి కుటిలుడూ, పాపీ దశరథమహారాజు కడుపున ఎలా పుట్టాడు? ఎవరైనా నిన్ను ఇలాటి పని ఎందుకు చేశావని అడిగితే ఏం చెబుతావు? ఈ నీ పరాక్రమం నా మీద చూపకపోతే, నీకు ద్రోహం చేసిన ఆ రావణుడి మీద చూపలేకపోయావా? నువ్వు నాకు ఎదురుగా నిలిచి యుద్ధం

చేసి ఉంటే ఈపాటికి నిన్ను యముడి వద్దకు పంపి ఉందును. నన్ను అడిగి ఉంటే, నీకు ఒక్కరోజు లోపల సీతను వెతికి, తెచ్చి ఇచ్చి ఉందును. సుగ్రీవుడు నన్ను చంపించి వానరరాజు కాగోరటం సహజం. కాని నువ్వు నన్ను చాటునుంచి చంపటం మాత్రం అక్రమం."



ఇలా చెప్పి, క్రమంగా స్పృహకోల్పో తున్న వాలితో రాముడు, "నీకు ధర్మ సూక్ష్మం తెలియక నన్ను నిందించావు. ఈ భూప్రపంచమంతా ఇక్ష్వాకుల రాజ్యం. దీనికి భరతుడు రాజు. అతని ఆనతి మీద మేం ధర్మాన్ని కాపాడుతూ సంచరి స్తున్నాం. నువ్వుధర్మంతప్పావు. తమ్ముడు కొడుకుతో సమానుడు. నీ తమ్ముడి భార్య అయిన రుమను నువ్వు కాజేశావు. ఆ తప్పుకు నువ్వు ఈ విధంగా శిక్ష పొందావు. అంతేగాక, నాకు సుగ్రీవుడు లక్ష్మణుడి లాటి వాడు. అతని స్నేహం కోసం కూడా నేనీ పని చేశాను. నిన్ను నేను చంపటం అధర్మం ఎంత మాత్రమూ కాదు. నిన్ను చాటున ఉండి కొట్టినం దుకు నేనేమీ విచారించటం లేదు. వన మృగాలను కొట్టేవాళ్ళు దాగి ఉండీ, వలలను పన్నటం లాటి అనేక మాయో పాయాలను అవలంబించీ ఆ పని చేస్తారు. తినే జంతువులనే గాక, తినని జంతువు లను కూడా రాజర్షులు చంపుతారు. నువ్వు తినరాని మృగానివి." అన్నాడు.

ప్రాణం పోయే ముందు వాలి రాము డితో, "నేను చచ్చిపోతున్నందుకు విచా రించను. తారను గురించీ, బంధువులను గురించీ నాకు చింతలేదు. నా చింత అంతా అంగదుణ్ణి గురించి. వాడికి నే నంటే ప్రాణం. నా కోసం బెంగపడతాడు. అతన్ని కాపాడు. వాణ్ణి సుగ్రీవుణ్ణి చూసినట్టు చూడు. తారను సుగ్రీవుడు నా కారణంగా అవమానించకుండా ఉండేటట్టు చూడు," అన్నాడు.

రాముడు అలాగే చేస్తానని చెప్పాడు. వాలికి స్పృహతప్పింది.

ఈ లోపల వాలి సంగతి తారకు తెలిసింది. ఆమె అమితమైన దుఃఖంతో, కొడుకును వెంట బెట్టుకుని కిష్కింధ నుంచి వచ్చింది. దారిలో ఆమెకు కొందరు వానరులు ఎదురై, ;"తారా, వెనక్కు వెళ్ళు. నీ కొడుకు అంగదుణ్ణి కాపాడుకో. రాముడి రూపంలో మృత్యువు వచ్చి వాలిని తీసుకుపోతున్నది. నగరద్వారాలు భద్రంగా మూయించి, అంగదుడికి పట్టాభిషేకం చెయ్యి. లేకపోతే నీకు కిష్కింధలో నిలవనీడ దొరకదు; శత్రువులైన వానరులు వచ్చి ఆక్రమించుకుంటారు," అన్నారు.

ఆ మాటకు తార, "నా భర్తే పోగా, కొడుకూ, రాజ్యమూ, నా శరీరమూ ఏమయితేనేం? ఆ వాలి దగ్గిరికే పోతాను," అని తలా, రొమ్మూ బాదుకుని ఏడుస్తూ వేగంగా వెళ్ళి, నేల మీద పడి ఉన్న వాలినీ, దగ్గరే నిలబడి ఉన్న రామ, లక్ష్మణులనూ చూసింది. తరవాత ఆమె వాలి వద్దకు వెళ్ళి, అతన్ని కౌగలించుకుని ఏడ్చింది. తారనూ, అంగదుణ్ణీ చూడగానే సుగ్రీవుడికి కూడా దుఃఖం వచ్చింది.

హనుమంతుడు తారను చూసి, ఆమెను ఈ విధంగా ఓదార్చాడు: "తారా, పోయిన వారిని గురించి దుఃఖించ నవసరం లేదు. ఎందుకంటే, అంతా పోయేవాళ్ళే. విచారించవలసినదీ, దిగులు పడవలసినదీ నిన్ను గురించి. నీకు కొడుకున్నాడు. వాడి యోగక్షేమాలు విచారిస్తూ, వాడి జీవితం తీర్చిదిద్దు. వాలి మహాత్ముడు. అతనికి ఉత్తమ లోకాలు కలిగాయి. అంగదుడు రాజయితే, నువ్వు అతనికి సహాయంగా ఉండు. వాలికి ఉత్తరక్రియలు జరపాలి. అంగదుడికి రాజ్యాభిషేకం చెయ్యవలసివుంది."

ఈ మాటకు తార, "హనుమంతుడా, నువ్వు చెప్పినవేవీ నేను చేసే పనులు కావు, సుగ్రీవుడు చెయ్యవలసినవి. నేను వాలితో పోవలసినదాన్నే," అన్నది.





# విదూషకుడి పరిష్కారం

విమలదేశాన్ని పాలించే యశోవర్మ, ప్రజా క్షేమానికై నిత్యం పాటుపడేవాడు. ఆయనది విచిత్రమైన మనస్తత్వం. చాలాసార్లు ప్రజల సమస్యల గురించిన చర్చలలో మునిగిపోయి, విశ్రాంతి భవనానికి సైతం వెళ్ళేవాడు కాదు. అదేమని అంతరంగికులు ప్రశ్నిస్తే, ''విశ్రాంతి భవనానికి వెళ్ళి కూర్చోవడం, ప్రజాసమస్యలనుంచి తప్పించుకోవడం అవుతుంది కానీ, వాటికి పరిష్కారం ఎలా అవుతుంది?'' అనేవాడు. ఆయన స్వభావంలోని లోతుపాతులు ఎవరికీ అంతుపట్టేవి కాదు.

ఒకసారి విమలదేశంలో హఠాత్తుగా క్షామం సంభవించింది. వరసగా మూడేళ్ళపాటు వర్షాలు పడకపోవడంతో ప్రజలు చాలా కష్టాలపాలయ్యారు. దీన్ని అదనుగా తీసుకుని, పొరుగురాజైన వీరసేనుడు విమలదేశంపై యుద్ధం ప్రకటించాడు.

ఈ సమస్యగురించి, యశోవర్మ మంత్రులతో సంప్రదించాడు. వాళ్ళందరూ, ''మహారాజా, దేశం కరువుకాటకాలవల్ల చాలా క్లిష్టపరిస్థితులలో వున్నది. యుద్ధం మరింత నష్టానికి దారితీస్తుంది. కనుక వీరసేనుడితో సంధి చేసుకోవడం శ్రేయస్కరం,'' అని సలహా ఇచ్చారు.

ఇందుకు యశోవర్మ, ''సంధి చేసుకోవడం అనేది, నాకు గిట్టదు. యుద్ధమనే సమస్యకు సంధి పరిష్కారం ఎలా అవుతుంది? సమస్యనుంచి పారిపోవడం, సమస్యకు పరిష్కారం ఎన్నటికీ కానేరదు. ఇది నా సిద్ధాంతం. ఈ సంగతి తెలిసి కూడా, మీరు సంధి ప్రమేయం తేవడం బాగా లేదు. అంతకన్న యుద్ధంలో ఓడిపోవడమే ఉత్తమం,'' అన్నాడు.

రాజు అన్నదానికి మంత్రులు వినయంగా, ''క్షామం అనే సమస్యముందు,

వక్కలంక 'కిషోర్'



యుద్ధం అనే సమస్య చిన్నదికదా! కాబట్టి సంధి కుదుర్చుకోవడం, కేవలం రాజీ పడడంకాదేమో ఆలోచించండి," అన్నారు.

"ఈ సమయంలో యుద్ధం నాకు మాత్రం ఇష్టమా? కానీ సమస్యనుంచి తప్పించుకుపోజూడడం, నా స్వభావానికి విరుద్ధం. మరేదైనా మార్గం చెప్పండి," అన్నాడు యశోవర్మ.

మంత్రులు పక్కనేవున్న మరొక గది లోకి పోయి, చాలాసేపు చర్చలు జరి పారు. తమ మాటలతో రాజును సంతృప్తి పరచడం సాధ్యం కాదనిపించింది. వాళ్ళల్లో కొందరు రాజును ఛాందసుడనీ, మూర్ఖుడనీ కూడా అన్నారు.

కొంతసేపటికి మంత్రులు, రాజువద్దకు తిరిగివచ్చి, "మహారాజా, ఈ సమస్యను మరింత కూలంకషంగా చర్చించి, రేపు తమను దర్శించి మా అభిప్రాయమేమిటో చెబుతాం," అని చెప్పి, వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళాక రాజు యశోవర్మ దిగులుగా కూర్చున్నాడు. ఆ సమయంలో అటుగా వచ్చిన విదూషకుడు విశారదుడు, ఆయనను, "ఏం, మహారాజా, అలా వున్నారు?" అని అడిగాడు.

ఆ సమయంలో విశారదుడి రాక, యశోవర్మకు ఆనందాన్ని కలిగించింది. ఎందువల్లనంటే—విశారదుడు మంచి చతురుడేకాక, తర్కశాస్త్ర ప్రవీణుడు కూడా. యశోవర్మ ఏవైనా సమస్యలతో సతమతమవుతూన్నప్పుడు విదూషకుణ్ణి కవ్వించి, అతడి మాటలకు నవ్వడం అలవాటు.

"విశారదా, ఏం చెప్పమంటావు! చాలా చిక్కు సమస్య వచ్చిపడింది," అన్నాడు యశోవర్మ.

"యుద్ధం గురించిన సమస్యేకదా, ప్రభూ?" అని అడిగాడు విశారదుడు.

యశోవర్మ నవ్వి, "ఆసమస్యనునువ్వేం పరిష్కరించగలవు గాని, ఇది మరొకటి. నేనీమధ్య బాదరాయణీయం అన్న ఒక గ్రంథం చదివాను. 'ఏ గ్రంథం చెప్పిన

విషయాన్నయినా గుడ్డిగా నమ్మవద్దు' అని ఆ గ్రంథం చెబుతున్నది,'' అన్నాడు.

''సరే, మీరిప్పుడు చెప్పదలచిన దేమిటి?'' అని అడిగాడు విదూషకుడు.

''నేను ఆ బాదరాయణీయం చెప్పిన విషయాన్నే నమ్మడం లేదు. ఇంతకూ నేను ఆ గ్రంథ సారాంశాన్ని అనుసరిస్తున్నట్లా? లేనట్లా?'' అని ప్రశ్నించాడు యశోవర్మ.

విశారదుడికి, అసలు సమస్య ఏమిటో అర్థం చేసుకోవడానికి కొంత సమయం పట్టింది. బాదరాయణీయం అనే గ్రంథం నిజంగా లేదనీ, రాజు తనను కవ్వించడానికే దాన్ని కల్పించాడనీ, అతడు గ్రహించాడు.



విశారదుడు, రాజుతో, ''ప్రభూ, అసలు ఇందులో సమస్య ఏమున్నది? బాదరాయణీయాన్ని నమ్మడం లేదని, మీ నోటనే చెప్పారు కదా! ఇక దాన్ని అనుసరించినట్లెలా అవుతుంది?'' అన్నాడు.

దానికి రాజు, ''ఒక విధంగా చూస్తే, నమ్మకపోవడం ఆ గ్రంథాన్ని అనుసరించడమే అవుతుంది. ఆలోచించి చూడు! ఎందుకంటే, ఏ గ్రంథమైనా బాదరాయణీయం పరిధిలోకే వస్తుందిగదా! చివరకు ఆ గ్రంథం కూడా,'' అన్నాడు.

విశారదుడు కొద్దిసేపు ఆలోచించి చిన్నగా నవ్వి, ''ప్రభూ, నాకవన్నీ తెలియవు. నిత్యసత్యవ్రతులైన మీరు 'ఈ గ్రంథాన్ని నమ్మను' అని అన్నాక దానిని అనుసరించినట్లే,'' అన్నాడు.

యశోవర్మ విసుగ్గా ముఖం పెట్టి, ''నువ్వేదో తెలివైనవాడి వనుకున్నాను. పొగడ్తలతో సమస్యను పక్కకు మళ్ళించక సరిగ్గా చెప్పు. నేను బాదరాయణీయ సారాంశాన్ని అనుసరిస్తున్నట్లా? లేనట్లా? రాజుగా ఆజ్ఞాపిస్తున్నాను. నా ఆజ్ఞను ధిక్కరించదలిచావా?'' అన్నాడు.

ఇందుకు విశారదుడు ఒక క్షణం ఆగి, ''ప్రభూ, స్వయానా మీరు వచ్చి, 'నాకు వ్యతిరేకంగా ప్రవర్తించు' అని చెప్పినా, నేను మీకు వ్యతిరేకంగా ప్రవర్తించలేను.



సమస్యలకు సరైన పరిష్కారం లేదం టావా ?'' అని ప్రశ్నించాడు.

''లేకేం, ప్రభూ! 'నేను తప్ప మరెవరు చెప్పినా, నా ఆజ్ఞను ధిక్కరించవద్దు' అని మిమ్మల్ని మీరు మినహాయించుకోవడం ఒక్కటే దీనికి పరిష్కారం. అలాగే 'బాదరాయణీయం' విషయంలో కూడా! 'బాదరాయణీయం తప్ప మరే ఇతర గ్రంథ సారాంశాన్నీ గుడ్డిగా నమ్మవద్దు' అని ఆ గ్రంథంలో రచయిత రాసి వుండ వలసింది. అదే దానికి పరిష్కారం!'' అన్నాడు విశారదుడు.

అలాంటిది మీ ఆజ్ఞనెలా ధిక్కరించ గలను? ఈ సమస్యను గురించి అలాగే ఆలోచించిచెబుతాను,"అన్నాడునవ్వుతూ.

యశోవర్మకు అతడి మాటల్లో ఏదో మర్మమున్నట్టు తోచింది. ఆయన ఏదో గ్రహించినవాడల్లే తల వూపి, ''విశారదా! నువ్వు చాలా తెలివైనవాడి వనడంలో సందేహం లేదు. ఇంతకుముందు నువ్వన్న మాటలతో, అచ్చం నేనిచ్చిన సమస్య లాంటిదే మరొకటి సృష్టించావు. స్వయానా నేను నిన్ను నాకు వ్యతిరేకంగా వర్తించ మని చెప్పినా, అలా చేయననడం ఒక విధంగా నన్ను ధిక్కరించడం కూడా అవుతుంది. అయితే, ఇక ఇలాంటి

''కానీ బాదరాయణీయంలో అలాంటి మినహాయింపు లేదు. అప్పుడు ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి?'' అని ప్రశ్నించాడు యశోవర్మ.

''మినహాయింపు లేకపోతే సృష్టించుకో వాలి, ప్రభూ! అంతకుమించి మరొక మార్గం లేనేలేదు,'' అని జవాబిచ్చాడు విశారదుడు.

''అలా మినహాయింపును సృష్టించుకో వడం, సమస్యనుంచి తప్పించుకున్నట్లవు తుంది కానీ, పరిష్కారం కానేరదు కదా?'' అన్నాడు యశోవర్మ.

అందుకు విశారదుడు, ''అసలు మీ అభిప్రాయంలో సమస్యకు పరిష్కారం అంటే ఏమిటి ప్రభూ? పరిష్కారం అనే

మాటకు, సమస్య మటుమాయం కావడం అనే కదా అర్థం,'' అన్నాడు.

''కానేకాదు! అది సమస్య మటుమాయమవడం కాదు, మనం దాని నుంచి పలాయనం చేసినట్లవుతుంది. ప్రజా సమస్యలు ఎక్కువగా వున్నప్పుడు నేను విశ్రాంతి భవనంలో కాలం గడపడాన్ని సైతం, సమస్యలనుంచి పారిపోవడంగానే పరిగణిస్తాను,'' అన్నాడు యశోవర్మ.

''కానీ, ప్రభూ! విశ్రాంతి భవనంలో కాలం గడపడంవల్ల, మీ మనసుకు ప్రశాంతతలభించి, ఆసమయంలో సమస్యలకు పరిష్కారాలు దొరకవచ్చు గదా! అప్పుడు అక్కడ కాలం గడపడం, పలాయనం ఎలా అవుతుంది?'' అని అడిగాడు విశారదుడు.

యశోవర్మకు, తన విదూషకుడి మాటల్లో ఎంతో నిజమున్నట్లనిపించింది.

ఆయన మందహాసం చేసి, ''నిజమే, విశారదా! నిన్ను తక్కువగా అంచనా వేశాను. ఒక విధంగా, నా సిద్ధాంతంలో వున్న లోపాన్ని నువ్వు సరిదిద్దావు. ఏమైనా, మనిషి కొన్నిసమస్యలనుంచిపారిపోక తప్పదంటావా? ఈ ప్రశ్నకు ఇంకా సమాధానం దొరకలేదు,'' అన్నాడు.

విశారదుడు కొంచెంసేపు మౌనంగా వూరుకుని, ''తప్పదు, ప్రభూ! జీవితంలో విచిత్రంగా కొన్ని సమస్యలకు, వాటి నుంచి తప్పించుకుపోవడమే ఏకైక పరిష్కారమార్గం అవుతూ ఉంటుంది. అలాంటి సమయాల్లో, ఆ తప్పించుకుపోవడాన్ని కేవలం పలాయనంగా కాక, ఆ సమస్యకు పరిష్కారంగానే భావించాలి. ఇది ముమ్మాటికీ నిజం!'' అన్నాడు.

''బాగా చెప్పావు, విశారదా! నీకు తెలియకుండానే, నువ్వు నా ముఖ్య సమస్యను కూడా పరిష్కరించావు!'' అంటూ యశోవర్మ, అతడికి ఒక విలువైన హారాన్ని బహూకరించాడు.

ఆ మర్నాడే ఆయన తన మంత్రులకు, తాను వీరసేనుడితో సంధికి అంగీకరిస్తున్నట్టు తెలియజేశాడు.





# మహాకావ్యం

విష్ణుపురం అనే అగ్రహారంలో వుండే, మురళీమోహనుడనే వాడికి, తను చాలా గొప్ప కవినని నమ్మకం. వాడు రెండు నెలలపాటు ఎంతో శ్రమపడి, ఒక కావ్యాన్ని రచించాడు. ఒకటికి రెండు సార్లు దాన్ని చదివాక, వాడికి అది చాలా గొప్ప కావ్యమన్న అభిప్రాయం కలిగింది.

ఆ అగ్రహారంలో వాణీనాధుడనే ఒక మహాపండితుడున్నాడు. సంస్కృతాంధ్రాలలో ఆయన చదవని కావ్యమంటూ లేదు. ఆయన మెచ్చుకుంటే, తన కావ్యానికి గుర్తింపు వచ్చినట్లే అని భావించి, ఒక రోజున మురళీమోహనుడు, వాణీనాధుణ్ణి కలుసుకుని, ''అయ్యా, నేనొక కావ్యం రాశాను. దాన్ని చదువుతాను, తమరు వినాలి,'' అన్నాడు.

"సరే, చదువు," అన్నాడు వాణీనాధుడు. మురళీమోహనుడు తన కావ్యాన్ని చదవసాగాడు. కొంత సేపయ్యాక వాణీనాధుడు, ''నాయనా, చదవడం ఆపు. నాకు వేరే పనులున్నవి,'' అన్నాడు.

''సరే, రేపు తమ దర్శనం చేసుకుంటాను,'' అని మురళీమోహనుడు, ఆ రోజుకు వెళ్ళిపోయి, మర్నాడు వాణీనాధుడి వద్దకు వెళ్ళి మళ్ళీ కావ్యం చదవసాగాడు.

కొంతసేపు విన్నాక వాణీనాధుడు, తనకేవో పనులున్నాయన్నాడు.

ఈ విధంగా వారం రోజులు గడిచాయి. తన కావ్యం మొత్తం వాణీనాధుడికి త్వరగా వినిపించాలని మురళీమోహనుడు ఆదుర్దా పడసాగాడు. అయితే, ఇప్పుడు జరుగుతున్న తీరులో నెల రోజులైనా అనుకున్న పని పూర్తయేలా వాడికి కనిపించలేదు.

ఒక రోజున వాణీనాధుడితో వాడు, ''అయ్యా, ఒక్క రోజును తమరు

"వసుంధర"

పూర్తిగా, నా కోసం కేటాయించలేరా?'' అని అడిగాడు.

''అందువల్ల, నీకు కలిగే లాభమేమిటి?'' అన్నాడు వాణీనాధుడు.

''నేను తమకు వినిపించదలచుకున్న కావ్యం మొత్తం, ఒక్కసారిగా అయిపోతుంది,'' అన్నాడు మురళీమోహనుడు.

వెంటనే వాణీనాధుడు, ''అసలు ఏ ప్రయోజనంఆశించి, దీన్ని నాకువినిపించాలనుకుంటున్నావు?'' అని ప్రశ్నించాడు.

''ఇది ఒక మహాకావ్యమని తమరు తెలుసుకుంటారని!'' అన్నాడు మురళీమోహనుడు.

''ఇది మహాకావ్యమా? ఆ విషయం వింటే ఎలా తెలుస్తుంది? నువ్వు నోటితో ఒక్క మాట చెబితే సరిపోయేది కదా, ఇంతశ్రమ ఎందుకు తీసుకున్నావు?'' అన్నాడు వాణీనాధుడు జాలిగా.

''అయ్యా, అలా కాదు. తమరు దీన్ని తమ నోటిమీదుగా మహాకావ్యమని అనాలి. అదీ నా కోరిక,'' అన్నాడు మురళీమోహనుడు.

''అయ్యో! ఈ సంగతి ముందే చెబితే, ఇన్నాళ్ళూ నీకూ, నాకూ శ్రమతప్పేది. సరే, ఇది మహాకావ్యమని అంటున్నాను. ఇక నాకు వినిపించకు,'' అన్నాడు వాణీనాధుడు.

మోహనుడు సందేహిస్తూ, ''తమరే కాదు, ఏ గొప్ప పండితుడైనా దీన్ని మహాకావ్యమని అనగలడా?'' అని అడిగాడు.



"తప్పక అంటారు. కానీ ఎటొచ్చీ నువ్వా పండితులకు దీన్ని వినిపించనని ముందుగా మాట యివ్వాలి," అన్నాడు వాణీనాధుడు.

ఆ జవాబుకు మురళీమోహనుడు తెల్లబోయి, "అయ్యా, అదేమిటి ? వినకుండా ఇది మహాకావ్యమని వారికెలా తెలుస్తుంది ?" అని అడిగాడు.

"నాయనా, అందుకు ఒక కారణం ఉన్నది. ఇది వినడం చాలా కష్టం. దీన్ని మహాకావ్యమని ఒప్పుకోవడం ద్వారా, ఆ శ్రమ తప్పుతుందంటే—ఏ పండితుడైనా సంతోషంగా అందుకు ఒప్పుకుంటాడు," అన్నాడు వాణీనాధుడు.

"అలా కాదు. దీన్ని అందరూ మహాకావ్యమని అంగీకరించాలి. అందుకు నేనెలాంటి మార్పులు చేయాలో చెప్పండి; ఆ ప్రకారం చేస్తాను," అన్నాడు మురళీమోహనుడు.

"అయితే నీ కావ్యం పేరు మార్చు. దానికి మహాకావ్యమని కొత్తపేరుపెట్టు. అప్పుడందరూ దీన్ని మహాకావ్యమని పిలవక తప్పదు. ఇంతకుమించి మరే ఉపాయమూ చెప్పలేను," అన్నాడు వాణీనాధుడు.

తన కావ్యం ఆ పండితుడికి నచ్చలేదన్న విషయం, అప్పటికి అర్థం కాగా, మురళీమోహనుడు నొచ్చుకుని, "అయ్యా, కావ్యం తమకు నచ్చకపోతే, ఆ విషయం ముందే చెప్పి వుండవలసింది!" అన్నాడు.

అందుకు వాణీనాధుడు చిరునవ్వు నవ్వి, "ఎప్పుడైతే నీ కావ్యాన్ని ఒకసారి వినడానికి నిరాకరించానో, అప్పుడే నీకు విషయం అర్థమయి వుండాలి. నువ్వు అర్థం చేసుకోలేకపోయావు. నేనేం చేయగలను ? నువ్వు నీ కావ్యాన్ని మహాకావ్యమని పొగడుకోగలవేమో ! నాకు మాత్రం ఎదుటివారి రచనను నిరసించడం మనస్కరించదు," అన్నాడు.

మురళీమోహనుడు మాట్లాడకుండా, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.





# ఇష్టంలేని న్యాయం

పూర్వం ఒక గ్రామంలో రామయ్య అనే కాపు ఉండేవాడు. ఆయన భార్య గంగమ్మ గయ్యాళి. తమకు భగవంతుడింత ఇచ్చాడు గదా అని మిడిసి పడేది.

ఒకనాడు రామయ్యా. గంగమ్మా పొరుగూరులో బంధువుల ఇంట అక్కర అయితే వెళ్ళి కాలినడకను తిరిగి వస్తున్నారు. మసకచీకటి పడుతున్నది. గ్రామం కూడా అంతదూరంలో ఉన్నది. వారికి దారిలో మామిడి చెట్టొకటి ఎదురయింది. చెట్టునిండా మామిడి పళ్ళు. కొన్ని పండినవీ కొన్ని ఇంకా పండనివీ కనిపించాయి.

"ఇదుగో! కాస్త మామిడి చెట్టెక్కి మంచి పళ్ళుగా చూసి కోసి పెట్టవూ ? ఈ ఏడు మామిడి పండెట్లా ఉంటుందో రుచే చూడలేదు," అన్నది గయ్యాళి గంగమ్మ.

"పొద్దుపోయింది. కావలిస్తే రేపు బుట్టెడు తెప్పిస్తాలే!" అన్నాడు రామయ్య.

"నాకిప్పుడే కావాలి. చెట్టెక్కి రెండు పళ్ళు కోస్తే పోయేదానికి రేపు బుట్టెడు తెస్తాట్ట!" అని సాధించింది గంగమ్మ.

గత్యంతరంలేక రామయ్య చెట్టెక్కటానికి వెళ్ళాడు. ఆయన చెట్టు కిందికి వెళ్ళాడో లేదో చెట్టు కొమ్మమీది నుంచి ఎవరో ఆయనపై పడ్డాడు. రామయ్య కింద పడిపోయాడు. కాలు పట్టుకు పోయింది.

"అయ్యో! అయ్యో! నీకెంత పొగరురా కావాలని నా మొగుడి మీద విరుచుక పడతావుట్రా?" అని కిందపడిన మనిషిని ఆడిపోయసాగింది గంగమ్మ.

అ మనిషి లేచి రామయ్యను లేవదీస్తూ, "అమ్మా, తల్లీ! నేను కాలుజారి పడ్డాను. కావాలని పడలేదు. దేవుడు

సాక్షి!'' అంటూ ప్రాధేయపడ్డాడు. కాని గయ్యాళి గంగమ్మ వినిపించుకోలేదు. గుడ్లెర్రచేసి చేతులు ఊపుతూ, ''నిన్ను వూళ్ళో చెప్పి ఏం చేయిస్తానో చూడు! నీ అబద్ధాలు గంగమ్మ దగ్గరనా?'' అంటూ తిట్టసాగింది.

భార్యాభర్తలు ఊరు చేరుకున్నాక గంగమ్మ ఊరి న్యాయాధికారి దగ్గరకువెళ్లి ఫిర్యాదు చేసింది. "ఎందుకు, ఊరుకోవే!" అని మొగుడు అన్నా వినిపించుకోలేదు. ''ఇదిగో! నువ్వెప్పుడూ యింతే! ఊళ్ళో వాళ్ళంతా నీమీద పడినా చూస్తూ ఊరుకుంటావు,'' అన్నది గంగమ్మ.

న్యాయాధికారి మర్నాడు గంగమ్మనూ, రామయ్యనూ, రామయ్య మీద పడిన బసవయ్య అనే వాణ్ణీ పిలిపించాడు.

అందరు చెప్పినది విన్న మీదట న్యాయాధికారి కూడా బసవయ్య బుద్ధి పూర్వకంగా తప్పుచేయలేదని నమ్మాడు. ఈసారికి బసవయ్యను క్షమించిపోనివ్వమని గంగమ్మకు హితవు చెప్పాడు.

''ఇదేనా మీరు చెప్పే న్యాయం? ఈ దుర్మార్గుడు మామిడి చెట్టులో దాక్కుని మా ఆయన చెట్టు కిందికి రావటం చూసి మీద దూకేస్తాడా? మీవల్ల కాకపోతే చెప్పండి. నేనింకో చోటుకివెళ్ళి న్యాయం రాబట్టుకుంటాను,'' అన్నది గంగమ్మ.

''సరే, అయితే, నీకు కావలసిన న్యాయం నేనే చేస్తాను! ఆ మామిడిచెట్టు నువ్వే ఎక్కు. బసవయ్య దాని కిందికి రాగానే సూటిగా అతని మీద దూకు!'' అన్నాడు న్యాయాధికారి.

''నేను చెట్టెక్కనా? ఆ మనిషి మీద పడబోయి కిందపడితే? ఒకవేళ మనిషి మీదనే పడితే మాత్రం నాకు దెబ్బ తగలదూ?'' అన్నది గంగమ్మ వెలాతెలాపోతూ.

''ఈ అనుమానాలన్నీ బసవయ్యకైనా ఉండవలసిందే గద! మరి బసవయ్యమాట నమ్మవేం?'' అన్నాడు న్యాయాధికారి.

గంగమ్మ బుద్ధితెచ్చుకుని తిరిగి చూడకుండా భర్తతోసహా ఇంటికి పోయింది.



ఉత్తర ఐరోపాలోనూ, గ్రీన్‌లాండ్‌లోనూ నివసించే ఆర్కిటిక్ టెర్న్ అనే ఒకరకం శీవపిట్టలు—11,000 మైళ్ళు ప్రయాణంచేసి ప్రపంచంలో మరొక చివరిభాగమైన అంటార్కిటికా ఖండానికి చేరుతాయి. సంవత్సరాంతంలో అవి మళ్ళీ అంతదూరం పయనించి స్వస్థలాలను చేరుకుంటాయి!



## బహుదూరం పయనించే పక్షి!



## మాయమవుతూన్న నయాగరా!

నయాగరా జలపాతం యేడాదికి మూడడుగులు ప్రకారం తగ్గుతూ వస్తున్నది. 10,000 సంవత్సరాలకు పూర్వం ఆ జలపాతం ఏర్పడిన స్థలానికి ఏడుమైళ్ళ దూరంలో ప్రస్తుతం ఉన్నది. మరొక 25,000 సంవత్సరాలనాటికి ఇది ఈరీ తటాకంలోకి పూర్తిగా మాయం కాగలదని భావిస్తున్నారు!

## 'మహామీనం'

ప్లాంక్‌టన్ జాతి చేపలే ప్రపంచంలో అన్ని చేపలకన్నా చాలా పెద్దవి. తిమింగిలాలనూ, సొరచేపలనూ సైతం పట్టి తినగల ఈ మహా మీనం 59 అడుగుల పొడవూ, 43 టన్నుల బరువూ వరకు పెరుగుతుంది.



# RAMBO IV



No more evil, injustice and crime will be tolerated in this city. The relentless crusader is here. With his famed Zap Gun (the three sound gizmo that's the terror of the underworld) and his fleet of rough 'n tough ready-for-action vehicles — Wrecker, Super Dumper and Fire Engine. And of course, his missile-firing Helicopter. So... breathe easy. The one man army is here.

**SAMMO**

Mechanical and electronic toys









**CHANDAMAMA TOYTRONIX**

In collaboration with Sammo Corporation, S.Korea

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, 188, NSK Salai, Vadapalani, Madras 600 026

Mudra:M CTPL:4093

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



R. P. Ram



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చదవాలని ఎంతో ఇష్టం! రెండవ ఫోటో : బతకాలంటే తప్పదు కష్టం!

పంపినవారు : కాట్‌పల్లి కిషన్‌శాస్త్రి, కామార్, ఆదిలాబాదు జిల్లా (ఆ. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

చందమామ
ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00
చందా పంపవలసిన చిరునామా :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Ta dum, They is here

**Oops!**
**Kiddy grammar sure is catchy—Ya, they are here.**

Bow Wow 'n' Floppy the doggies (wuff! wuff!), Jumbo the elephant, Wobbit the rabbit, Teddy 'n' Sporty your bear buddies, the mouse of your house—Squeeks, not to mention Flipper the dolphin 'n' Bunny with the Twins. They are all part of the CUDDLES family. And hang on—there's more to come.



What stuffing to use, what shape to give, which colour to use...... We've spent long months in designing and crafting the toys which can take on the toughest torture test ever—childhandling. To ensure that they're safe.

The one thing we didn't do while making our toys was fool around. We left that entirely for your kid to do. Come, check us out.

CUDDLES

CHANDAMAMA TOYTRONIX
in collaboration with [illegible] Corporation, S.Korea

Chandamama Buildings, 188, NSK Salai, Vadapalani, Madras-600 026.